# ఇది మేజిక్!



**అద్భుత వంతెన :**
దగ్గరగా పెట్టిన రెండు గ్లాసులపైగా కాగితం ఉంది. దానిమీద మరో గ్లాసు పెట్టి చూపమని ఎవర్నైనా ఛాలెంజ్ చెయ్.

**కిటుకు :**
కాగితాన్ని కుచ్చిళ్లలా వంకీలు వంకీలుగా మడువు. దానికి గ్లాసును మోసే శక్తి వస్తుంది.



**మాయమయ్యే పెన్సిల్ :**
జేబు రుమాలు కింద పెన్సిల్ ఉంచు. తర్వాత జేబు రుమాల్ని ఎత్తి విదిలించు. పెన్సిల్ మటుమాయం!

**కిటుకు :**
పెన్సిల్ని జేబు రుమాలు కింద ఉంచగానే నీ చూపుడు వేలు పైకెత్తి పెన్సిలే జేబు రుమాల్ని పైకెత్తుతున్నదనిపించేలా చెయ్. అదే సమయంలో పెన్సిల్‌ని నీ చొక్కా-చేతిలోకి తోసెయ్. జేబు రుమాలు తీసే సరికి పెన్సిల్ మాయమయ్యుంటుంది! మేజిక్ అంటే ప్రాక్టీసు అన్నది గుర్తుంచుకో. మేజిక్ కళను ప్రదర్శించేందుకు నీకు కీమా విద్యేది ప్రాక్టీస్ మరి!



**4 నాణేలతో 5 :**
నీ కెదురుగా టేబిలు మీద నాలుగు నాణేల్ని ఉంచు. టేబిలు మీద ఉన్నవి నాలుగే నాణేలనడంలో సందేహం లేకుండా ఎంచి చూపించు. ఇప్పుడు ఈ నాణేల్ని టేబిలుపై నుంచి తొయ్యి. ఇక చూసుకో, మొత్తం అయిదు నాణేలు వస్తాయి.

**కిటుకు :**
టేబిలు కింద అయిదో నాణేన్ని కాస్త సబ్బుతో అతికించి పెట్టి ఉంటావన్నమాట. టేబిలు పైనుంచి నాలుగు నాణేలు తీసుకుంటున్నప్పుడు వేళ్లు టేబిలు కిందికి పోనిచ్చి అయిదో నాణేం చేతిలో వేసుకుంటావ్! ఎలా ఉంది గమ్మత్తు!

అద్భుతమైన ఈ గమ్మత్తులతో నీ మిత్రుల్ని ఆశ్చర్యంలో ముంచెత్తు. నమ్మడం కష్టం కాని ఇవి చేయడానికెంతో సులువు.

ఇక అన్నిటికన్నా సులువైన ట్రిక్కు మరొకటుంది. నీ పేరు మీద స్టేట్ బ్యాంక్ సేవింగ్స్ అకౌంట్ ప్రారంభించు. నీ వయస్సు 10 ఏళ్లకన్నా తక్కువైతే నీకోసం అకౌంట్ ప్రారంభించమని నాన్ననడుగు. నీ జేబు ఖర్చు కిచ్చిన డబ్బుల్ని, బహుమతులుగా వచ్చిన డబ్బులన్నీ కూడా అందులో వేసుకో. ఇక నీతో పాటే నీ పొదుపు డబ్బు కూడా రెండింతలూ మూడింతలుగా పెరుగుతూ పోవడం చూసుకో!

**పొదుపు చేసుకోడంలో పెద్ద మజా ఉంది మరి!**



జెమ్స్‌తో పొదిగాగా నా నావ
పయనిస్తా దాన్లో అద్భుత లోకంలో
తెస్తానిక మరెన్నెన్నో జెమ్స్
నీకోసం నాకోసం మనకోసం

Cadbury GEMS



చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని !

క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ సంచికతో, "చందమామ" తన ముప్ఫై ఏడవ ఏట ప్రవేశిస్తున్నది. చాలాకాలంగా పాఠకులు కల్పిత బేతాళ కథలను చదువుతున్నారు. అలా కాక, అసలు మూలకథలు ఎలా వుంటాయో చదవాలన్న కుతూహలం కొందరు కొత్త పాఠకులు కనబరిచారు. వారి కోసం, "ఏడ్పూ–నవ్వూ" అన్న కథతోపాటు, లోగడ ప్రచురించిన కొన్ని మంచి కథలను కూడా, ఈ సంచికలో తిరిగి ప్రచురిస్తున్నాము.

## అమరవాణి

ఆలానే గృహ్యతే హస్తీ, వాజీ వల్గాసు గృహ్యతే,
సద్వాక్యై గృహ్యతే విద్వాన్, దుష్టో విత్తేన గృహ్యతే.

[కట్టుకొయ్యకు కట్టి ఏనుగునూ, కళ్ళెములు పట్టి గుర్రాన్నీ, మంచి మాటలతో విద్వాంసుణ్ణీ, డబ్బుతో దుష్టుణ్ణీ వశపరుచుకో వచ్చు.]

---

సంపుటి 73 జూలై '83 సంచిక 1

విడి ప్రతి : 2-00 :: సంవత్సర చందా : 24-00



## చందమామ కబుర్లు

### అగాధమైన జలనిధిలో



1622 వ సంవత్సరం ఫ్లోరిడా (అమెరికా) జలసంధిలో చెలరేగిన తుపాను, శాంటా మార్గరిటా, అటోకా అనే రెండు స్పానిష్ ఓడలను తలకిందులు చేసింది. మూడు వందల ఎనభై మంది నావికులతోపాటు, దాదాపు ఆరు వందల కోట్ల డాలర్లు విలువచేసే బంగారం సముద్రంలో మునిగిపోయింది. ఆ తర్వాత కొన్నాళ్ళకు మెల్ ఫిషర్ అనే ప్రముఖ నిధి అన్వేషకుడు సముద్రగర్భం నుంచి దానిలో పదో వంతు బంగారాన్ని పైకి తీయగలిగాడు.

### ఎడారిలో తిమింగలాలు

భూగర్భ శాస్త్రజ్ఞుడు జియోఫ్రే ఫ్రాంక్స్ నూనెవనరుల కోసం సహారాఎడారిలో అన్వేషిస్తూంటే, తిమింగలాల అవశేషాలు బయల్పడ్డాయి. దాదాపు నాలుగు కోట్ల సంవత్సరాల క్రితం జీవించిన తిమింగలాల అవశేషాలు మాత్రమే కాకుండా, శిలలుగా మారిన సొర చేపల, మొసళ్ళ ఎముకలు కూడా బయల్పడడం వల్ల, సహారాఎడారి (ఆఫ్రికా) ఒకప్పుడు సముద్ర భాగం అని తెలుస్తోంది.



## మీకు తెలుసా?

1. గోవాకు పూర్వం వున్న పేరేమిటి?
2. ఆగ్రా నగరానికి ఆ పేరు ఎలా వచ్చింది?
3. డార్జిలింగ్ నగరానికి ఆ పేరు ఎలా వచ్చింది?
4. కాశీ ఒకే నగరం అయినా, దానికి కాశీ-వారణాసి అని రెండు పేర్లు రావడానికి కారణం ఏమిటి?
5. ఆసియా ఖండంలో, అన్నిటికన్న పెద్దదైన గులాబీతోట (గార్డెన్) ఎక్కడున్నది?
6. ప్రపంచంలో అన్నిటినీ మించిన ఎత్తయిన ప్రదేశంలో వున్న రైల్వేస్టేషన్ పేరేమిటి?
7. ప్రపంచంలోకెల్లా పెద్దదైన, పూర్తిగా పాలరాతితో కట్టబడిన మసీదు ఎక్కడున్నది?



# అమూల్యమైన ఆస్తి

పూర్వం విక్రమసేను డనే రాజు అమరావతీ నగరానికి రాజుగా ఉండేవాడు. ఆయనకు తన చుట్టూ ఉండే అధికారుల పైన కొంచెం కూడా ఆదరం ఉండేది కాదు. ఎందుకంటే వారు ఎంతసేపూ, "తమరు ఇంద్రులు, చంద్రులు! తమ పరిపాలనలో ప్రజలు స్వర్గసుఖాలు అనుభవిస్తున్నారు!" అని ఇచ్చకాలు పలుకుతూ ఉండేవారు. ఈ ధోరణి ఆయనకు నచ్చేది కాదు.

అందుచేత విక్రమసేనుడు అప్పుడప్పుడు మారువేషం ధరించి మామూలు మనిషిలాగా పల్లెటూళ్ళవెంట తిరుగుతూ, సామాన్య ప్రజలు ఎలా జీవిస్తున్నారో, వారి కష్టసుఖాలేమిటో స్వయంగా తెలుసుకుంటూ ఉండేవాడు. ఒక్కొక్కసారి ఆయనకు తాను తినే రాజభోజనం కంటె గుడిసెలలో వాళ్ళు తినే సామాన్యపు భోజనమే రుచికరంగా ఉన్నట్టు కూడా తోచేది.

ఒకనాడు విక్రమసేనుడు మారువేషంలో ఒక అడవి మధ్యగా వెళుతూండగా ఎవరో వేణువు ఊదటం వినిపించింది. రాజు ఆ పాట వచ్చిన దిక్కుగా వెళ్ళి ఒక గొర్రెలకాపరిని చూశాడు. వాడికి పదహారేళ్ళుంటాయి. చింకిబట్టలు ధరించినా మనిషి అందంగా ఉన్నాడు. వాడి అందచందాలు చూసి రాజు ఆశ్చర్యపడి, తనలాగే వాడు కూడా మారువేషంలో ఉన్న ఏ రాజకుమారుడో అనుకున్నాడు. కాని ఆయన ఆ కుర్రవాడితో సంభాషించి వాడి తల్లిదండ్రులు చాలా పేదవారని తెలుసుకున్నాడు.

ఆ గొర్రెలకాపరి పేరు సాంబుడు. వాడు రాజుగారి ప్రశ్నలకు సూటిగా సమాధానాలిచ్చాడు. వాడికి కపటంగా మాట్లా

ఎన్. సుందరరావు



డటం ఏమాత్రం చేతకాదు. వాడి మాటలలో అమాయకత్వమూ, మంచితనమూ ఉట్టిపడుతున్నాయి.

"సాంబూ, నా వెంట వస్తావా ? నీకు మంచి బట్టలిచ్చి, భోజనంపెట్టి ఉద్యోగం ఇస్తాను !" అన్నాడు రాజు.

సాంబుడు సరేనన్నాడు.

అమరావతీనగరం చేరి రాజభవనంలో అడుగుపెట్టాక, తనను తెచ్చినది రాజుగారేనని సాంబుడికి తెలియవచ్చింది. రాజుగారికి తనపై అంత అనుగ్రహం కలిగినందుకు వాడు సంతోషించాడు.

సాంబుడి గొర్రెలకాపరి దుస్తులు తీసివేసి రాజోచితమైన దుస్తులూ, రత్నాలు పొదిగిన తలపాగా ఇచ్చారు. వాడికి రాయటమూ, చదవటమూ, సభలో మసులుకోవటమూ నేర్పారు. కొద్దికాలం గడిచాక రాజుగారు సాంబుణ్ణి తన ఖజానాదారుగా వేసుకున్నాడు. అనేక కోట్ల విలవ చేసే ఆ ఖజానాకు అధికారిగా ఉండటానికి సాంబుడి కన్న నమ్మకస్థుడు దొరకడని రాజుగారు భావించాడు.

ఈ ఉద్యోగంలో చేరకమునుపు సాంబుడు రాజుగారి అనుమతితో తన గ్రామానికి వెళ్ళి తాను తిరిగిన చోట్లన్నీ మళ్ళీ తిరిగాడు. వేణువు ఊదాడు. తరవాత తన వారందరికీ వాడు కానుకలు ఇచ్చాడు. "రాజుగారి కొలువు ఎలా ఉంది?" అని తనవారు అడిగితే, "మీరు ఈ గ్రామాన్ని వదిలి ఎక్కడికీ వెళ్ళకండి! రాజ దివాణాలలో అసలే ఉద్యోగాలు చేయకండి ! నిజమైన సుఖం ఇక్కడే ఉన్నది!" అని సలహా ఇచ్చాడు.

తరవాత వాడు అమరావతికి తిరిగి వెళ్ళి రాజుగారి ఖజానాదారుగా పని ప్రారంభించాడు.

కొంతకాలానికి రాజుగారు చనిపోయాడు. రాజుగారి కొడుకు కనకసేనుడు సింహాసనం ఎక్కాడు. రాజుగారి అధికారులలో చాలామందికి సాంబుడంటే పడేది కాదు. ఎందుకంటే చనిపోయిన

రాజు గారు వాణ్ణి తమ అందరికన్న ఎక్కువ ఆదరంతో చూసేవాడు.

ఇప్పుడు ఈ అధికారులందరూ కొత్త రాజు చుట్టూ చేరి, "మహారాజా, మీ నాన్న గారి అండచేరి ఈ సాంబుడు మీ ఖజానాను కొల్లగొట్టేశాడు. వాణ్ణి ఒక కంట కనిపెట్టటం మంచిది !" అన్నారు.

తన అధికారులు తన క్షేమంకోరి ఏదైనా చెబితే రాజైనవాడు వినకుండా ఎలా ఉండగలడు ? "సాంబుడి ద్రోహం బయటపడే ఉపాయం చెప్పండి. అతణ్ణి శిక్షిస్తాను." అన్నాడు కనకసేనుడు.

"మీ తాతగారి వద్ద రత్నాలు తాపిన పిడిగల కత్తి ఉండేది. దాన్ని తెచ్చి తమకు చూపమనండి !" అని కుట్రదారులు రాజుకు సలహా ఇచ్చారు.

రాజు సాంబుణ్ణి పిలిపించి, "మా తాతగారి కత్తి నీ ఆధీనంలో ఉన్నదట. దాన్ని ఒకసారి తెచ్చి నాకు చూపించు !" అన్నాడు.

"మహారాజా, ఆ కత్తి పిడినుంచి రత్నాలు తీయించి తమ తండ్రిగారు ఆభరణాలు చేయించారు." అన్నాడు సాంబుడు.

సాంబుడు చెప్పిన మాట నిజమేనని రుజువయింది. ఎందుకంటే సాక్షులు చాలామంది దొరికారు.



"సాంబుడు నిర్దోషిగా కనిపిస్తాడు !" అన్నాడు రాజుగారు కుట్రదార్లతో.

"మహాప్రభూ, ఖజానాలో ఉన్న వస్తువులన్నిటి జాబితావేసి తీసుకురమ్మనండి. పాత జాబితాలతో పోల్చి ఏ వస్తువులున్నాయో, ఏవేవి పోయాయో తెలుసుకోవచ్చు !" అన్నారు కుట్రదార్లు.

రాజుగారి ఆజ్ఞ ప్రకారం సాంబుడు తన ఆధీనంలో ఉన్న అన్ని వస్తువులనూ జాబితా వేసి తెచ్చాడు. జాబితా చూస్తే వస్తువు లేవీ పోయినట్టు కనపడలేదు. వాడు వేసిన జాబితాలోని వస్తువులను తణిఖీ చెయ్యటానికి రాజుగారు సపరివారంగా ఖజానాకు వెళ్ళాడు.

ఖజానా చూస్తూంటే రాజుగారికి పరమానందమయింది. అందులో వస్తువులన్నీ ఎంతో అందంగా అమర్చి ఉన్నాయి. జాబితానుబట్టి వాటిని సరి చూడటం చాలా సులువుగా జరిగిపోయింది.

రాజుగారు వెళ్ళిపోవటానికి ముందుగా సాంబుణ్ణి ప్రశంసించబోతూండగా ఆయన వెంటఉన్న అధికారులలో ఒకడు ఖజానా గోడలోని చిన్న ఇనప తలుపు చూసి, "గోడలో ఏదో సొరుగు ఉన్నట్టుంది. అందులో ఏమున్నదో?" అన్నాడు.

రాజుగారు సాంబుడి కేసి తిరిగి, "ఆ సొరుగులో ఏమి వస్తువులున్నాయి? వాటిని ఈ జాబితాలో ఎందుకు చేర్చలేదు?" అని అడిగాడు.

"మహారాజా, మన్నించండి! ఆ సొరుగులో ఉన్నది అమూల్యమైన నా సొంత ఆస్తి! అందుచేత దానిని మీ జాబితాలో చేర్చలేదు!" అన్నాడు సాంబుడు.

ఈ మాటలు వినగానే, కుట్రదారులు సాంబుణ్ణి గురించి చెప్పిన చాడీలన్నీ రుజువయినట్టే రాజుగారికి అనిపించింది. ఆయన కోపంతో, "ముందు ఆ సొరుగు తలుపు తెరు!" అన్నాడు.

సాంబుడు ఇనప తలుపు తెరిచాడు. దాని వెనక గోడలో ఉన్న సొరుగులో ఒక గొర్రెలకాపరి కంబళీ, పాతచెప్పులూ, ఒక వేణువూ మాత్రమే కనిపించాయి.

రాజుగారు నిర్ఘాంతపోయి, "ఇదేనా నీ అమూల్యమైన ఆస్తి?" అని అడిగాడు.

"అవును, మహారాజా! నేను మీ తండ్రిగారి కొలువులో చేరకముందు నాకున్న ఆస్తి అదే. కొలువులో చేరాక నా మనసు సుఖమన్నది ఎరగదు. నేను సుఖపడింది, ఆ ఆస్తి ఉన్నంతకాలమే!" అన్నాడు సాంబుడు.

రాజుగారు సాంబుడి మాటలతో మంచి గుణపాఠం నేర్చుకున్నాడు. ఆయన సాంబుణ్ణి తన తండ్రికన్న కూడా ఎక్కువగా ఆదరించి, వాడిమీద చాడీలు చెప్పినవారి నందరినీ కొలువులో నుంచి తొలగించేశాడు.






## 3

[పింగళుడి సాయం వల్ల, పద్మపాదుడు సరస్సులోంచి, రెండు మొసలి పిల్లలను పట్టుకుని బయటికి వచ్చాడు. తరవాత పింగళుడికి తను ఎవరైందీ చెప్పి, భల్లూకపర్వతాల దగ్గిరకు తనతో రావలసిందిగా అతణ్ణి అడిగాడు. తన తండ్రి గురువైన వృద్ధుడొకడు, మహామాయుడనే మంత్రవేత్తను గురించి చెప్పిన వృత్తాంతం పింగళుడికి చెప్పసాగాడు-]

భల్లూక పర్వతలోయలో ప్రవహించే ఒక నది గర్భాన, ఒక పాడుపడిన దేవళం వుంది. ఆ దేవళంలో మహామాయుడనే గొప్ప మాంత్రికుడు సమాధి అయాడు. అతడు సమాధి అయినచోట ముఖ్యమైన వస్తువులు మూడు వున్నై. ఒకటి: అతడి వేలికి వున్న ఉంగరం! దాన్ని ధరించిన వాడికి, భూగర్భంలో వున్న నిధి నిక్షేపాలన్నీ కనబడతై. రెండు: వజ్రాలు తాపిన పిడిగల కత్తి! దాని నుంచి వెలువడే అగ్ని కణాలు ఎటువంటి శత్రువునైనా నాశనం చేయగలవు. మూడు: బంగారుతో చేయబడిన భూగోళం! ఆ భూగోళాన్ని సంపాయించినవాడు, దాన్ని గుండ్రంగా తిప్పి, తను ఏ దేశానికి చక్రవర్తి కావాలని కోరుకున్నా, ఆ కోరిక నెరవేరుతుంది.

కాని, మహామాయుడి నుంచి వీటిని సంపాయించాలంటే, ముందుగా చిలక



సరస్సులో మొసళ్ళ రూపంలో వున్న అతడి శిష్యులను చేజిక్కించుకోవాలి. ఇందుకు, పింగళుడనే ఒక జాలరి సాయం అవసరమవుతుంది. తరవాత అతడి సాయంవల్లనే, మహామాయుడి నుంచి ఉంగరం, కత్తి, భూగోళం కూడా సాధించవచ్చు. ఆ మూడు వస్తువులనూ సాధించినవారికి మాత్రమే మీ తండ్రి విడిచిపోయిన మంత్ర గ్రంథం ఉపయోగపడుతుంది.

"మా తండ్రిగారి గురువు, యింత వరకూ చెప్పి, మా ముగ్గురి ముఖాలకేసీ పరీక్షగా చూశాడు. చిలకసరస్సులో మొసళ్ళరూపం ధరించి వున్న మహామాయుడి శిష్యులను ముందు చేజిక్కించుకోవాలనేసరికే నాకు ఒళ్ళు జలదరించింది. మహామంత్రవేత్త అయిన మహామాయుడి శిష్యులతో, అందులోనూ వాళ్ళు మొసళ్ళ రూపంలో నీటి అడుగున వుండగా, పోరాడటం ఎలా సాధ్యమవుతుంది?

"నా తక్కిన సోదరులు కూడా, బహుశా నాలాగే వెలవెలపోయి వుంటారు. గురువు మా ముగ్గురినీ వుద్దేశించినట్టు బిగ్గరగా నవ్వి, "మహామాయుడి శిష్యులను జయించటంలో, నే చెప్పిన జాలరి పింగళుడు, మీకు చాలా సాయం చేయగలడు. కాని, యీ ప్రయత్నంలో మీరు ప్రాణాలు పోగొట్టుకున్నా పోగొట్టుకోవచ్చు. ముందుగానే హెచ్చరిస్తున్నాను," అన్నాడు.

"మా అన్నదమ్ముల్లో ముందుగా మండనుడు జవాబిచ్చాడు: "నేను, యిందుకు సిద్ధం. నా తండ్రి వదిలిపోయిన మంత్రగ్రంథం మీద వున్న తీపి, నాకు నా ప్రాణాల మీద కూడా లేదు," అన్నాడు.

"అతడలా మాట్లాడే సరికి, నాకూ, అనురూపుడికీ కూడా ధైర్యం కలిగింది. మేమూ మహామాయుడి శిష్యులతో పోరాడటానికి సిద్ధమే అన్నాం. అప్పుడు గురువు,

మాకు చిలకసరస్సుకు మార్గం చెప్పి, నీ చేత కాళ్లూ, చేతులూ కట్టించుకుని, సరస్సులో పడిన తరవాత చేయవలసిన దంతా వివరించాడు.''

''అయితే, నేను చేయవలసిన సాయ మేదో చేశాను. ఇప్పుడు, మీ వెంట నేను భల్లూకపర్వతాలకు రావలసిన అవసర మేమిటి?'' అని అడిగాడు పింగళుడు.

పద్మపాదుడు ఆ ప్రశ్న విని, కొంచెం సేపు ఆలోచించి, తరవాత పింగళుడి భుజం మీద ఆప్యాయంగా చేయివేస్తూ, ''పింగళా! నువ్వు, నన్ను గురించి ఏదో భయపడుతున్నట్టుంది. నా నుంచి నీకు ఎలాంటి హానీ జరగకపోగా, నీకు చాలా గొప్ప మేలు జరుగుతుంది. మహా మాయుడు సమాధి అయివున్న పాడు దేవళంలో ప్రవేశించవలసినవాడివి నువ్వు! ఆ పని మరొకరివల్ల కాదు,'' అన్నాడు.

''నాకు ఎలాంటి హానీ జరగదని మీరు ప్రమాణం చేసి హామీ యిస్తారా?'' అని అడిగాడు పింగళుడు.

పద్మపాదుడు ప్రమాణం చేశాడు. పింగళుడికి ఆ క్షణంలో తల్లి గుర్తు కొచ్చింది. ''నేను భల్లూకపర్వతాల నుంచి ఎన్నాళ్ళకు తిరిగి రాగలను?'' అన్నాడు పింగళుడు.



''రెండు నెలలు; అంతకంటే ఎక్కువ వుండదు. కాని, నువ్వు అక్కడి నుంచి తిరిగి యింటికి వెళ్ళేప్పుడు, యిలా వుండవు. నిన్ను యీ ప్రపంచంలో అందరి కన్నా గొప్ప ధనికుణ్ణి చేస్తానని మాట యిచ్చాను గదా!'' అన్నాడు పద్మపాదుడు.

''అప్పటి మాట అలా వుంచండి. ప్రస్తుతానికి నేను, చిల్లిగవ్వ కూడా చేత లేని అతి పేదవాణ్ణి. నేను యింటలేని రెండు నెలలూ, నా తల్లీ, సోదరులూ బ్రతకటం ఎలా?'' అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు గుర్రానికి వేలాడుతున్న ఒక సంచిలోంచి వెయ్యి మొహరీలు తీసి పింగళుడికి యిస్తూ, ''ఈ డబ్బు నీ తల్లికి

యిచ్చిరా. నీ క్షేమాన్ని గురించి, ఆమె భయపడవలసిందేమీ లేదు. రేపు యీ వేళప్పుడు నన్ను యిక్కడే కలుసుకో!'' అన్నాడు.

పింగళుడు, పద్మపాదుడిచ్చిన డబ్బు తీసుకుని అమితానందంతో యింటికి వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికి, యింటిలో అన్నలు లేరు. తల్లి ఒక్కతే అతడికోసరం ఎదురు చూస్తున్నది. పింగళుడు, తను తెచ్చిన వెయ్యి మొహరీలు తల్లిముందు పోశాడు. ఆమె గజగజలాడింది.

''పింగళా! యింత డబ్బు ఎక్కడిది? నాకు భయంగా వుంది,'' అన్నది తల్లి.

పింగళుడు జరిగిందంతా తల్లికి చెప్పాడు. తను రెండు నెలలలో క్షేమంగా యింటికి తిరిగి రాగలననీ, ఏమాత్రం భయపడవలసిన అవసరం లేదనీ ధైర్యం కలిగించాడు.

''మాంత్రికుల మంచితనంలో నాకు నమ్మకం లేదు. అయినా యీ పద్మపాదుడు అందరిలాంటివాడు కాదని చెపుతున్నావు. దేవుడి దయవల్ల నీకు ఏ కష్టాలూ కలగకుండా, భల్లూక పర్వతాల నుంచి సుఖంగా యింటికి తిరిగి రావాలని, ముక్కోటి దేవతలకూ మొక్కుకుంటున్నాను,'' అన్నది తల్లి.

మరునాడు పద్మపాదుడు చెప్పిన వేళకు, పింగళుడు చిలకసరస్సు దగ్గిరకు వెళ్లాడు. సరస్సు ఒడ్డున, పద్మపాదుడు ఒంటరిగా కూర్చుని వున్నాడు.



పక్కన ఒక సంచీ తప్ప, గుర్రంగాని మరే వాహనం గాని లేదు.

పింగళుడు, అతణ్ణి సమీపిస్తూనే, "పద్మపాదా! మన ప్రయాణం కాలి నడకనేనా?" అని అడిగాడు.

"కాలినడకనా? అది అసంభవం. భల్లూక పర్వతాలు చేరాలంటే, మనం రెండు మూడు వందల మైళ్ళు ప్రయాణం చేయవలసి వుంటుంది. ఆ ప్రయాణానికి మామూలు గుర్రాలు పనికిరావు. ఇక రెండు రోజుల్లో ఒక పర్వదినం వస్తుంది. ఆ రోజుకు మనం భల్లూక పర్వతాలు దగ్గిర వుండాలి. ఇవిగో మన వాహనాలు!" అంటూ పద్మపాదుడు, చిటికెడు మన్ను తీసుకుని మంత్రించి భూమిమీద చల్లాడు.

మరుక్షణం, పెళపెళా రావాలతో భూమి బద్దలయింది. అందులో నుంచి శిరస్సులు పైకెత్తి కర్ణకఠోరంగా ఓండ్రిస్తూ రెండు గాడిదలు బయటికి దూకినై. పద్మపాదుడు, వాటిలో ఒకదాని వీపు మీద తన దగ్గిర వున్న సంచిని వేలాడకట్టి, దానిమీద ఎక్కి కూచున్నాడు. పింగళుడు భయకంపితుడై, ఏమి చేయాలో తోచక రెండవ గాడిద కేసి చూస్తూ, కదలా మెదలక నిలబడ్డాడు.

"పింగళా, అది నీ వాహనం, త్వరగా ఎక్కి కూర్చో. మనం వెళ్ళవలసిన ప్రదేశం చాలాదూరం గదా. ఇక బయలు దేరదాం!" అన్నాడు పద్మపాదుడు నవ్వుతూ.



నాలుగు చెరగులా విస్తరింపజేశాడు. అతడు భగవంతుని అవతారమైన దత్తాత్రేయుడి భక్తుడు, శిష్యుడు. అతని అనుగ్రహంతో అణిమాది సిద్ధుల్నీ, అనేక శక్తుల్నీ పొందాడు. అవసరమైనప్పుడు అనేక ఆయుధాలతో వెయ్యి చేతులు వస్తూండేవి....అని సూతమహర్షి చెప్పగా, నైమిశారణ్య మునులు, "సూత మునీంద్రా! దత్తాత్రేయుడు విష్ణువు అవతారమేకదా, దత్తాత్రేయ చరిత్ర వినాలని కుతూహలపడుతున్నాము!" అని అన్నారు.

సూతుడు దత్తాత్రేయకథ ప్రారంభించాడు:

అత్రిమహర్షి కుమారుడికోసం విష్ణువును తలంచుతూ గొప్ప తపస్సు చేశాడు.

ఇటు అటు బ్రహ్మ, మహేశ్వరులతో కలిసి విష్ణువు ప్రత్యక్షమై, "అత్రిమహర్షీ! నేను నీకు దత్తుడిని అయ్యాను! మేము ముగ్గురమూ ఒక్కటే కనుక త్రిమూర్తుల అంశలతో నేను నీకు కొడుకునౌతాను! దత్తాత్రేయుడిగా పిలువబడతాను!" అని చెప్పి బ్రహ్మమహేశ్వర సహితంగా అంతర్థానమయ్యాడు.

అదే సమయంలో నారదుడు త్రిమూర్తుల అర్ధాంగులమని గర్విస్తూన్న సరస్వతి, లక్ష్మి, పార్వతుల ముందు



అత్రిమహాముని భార్య అనసూయ పాతివ్రత్య మహిమ సాటిలేనిదని సహేతుకంగా నిరూపించాడు. త్రిదేవీమూర్తులకు సాధ్యం కాని పనులు చేసింది ఆమె.

అనసూయ గంగను పీడిస్తున్న పాప పిశాచాలను నిర్మూలించింది.

నారదుడిచ్చిన ఇనుప గుగ్గిళ్ళను కమ్మగా పచనం చేసి యిచ్చింది. సూర్యుణ్ణి ఉదయించకుండా చేసిన సుమతిని ఒప్పించి, సూర్యోదయమైతే చనిపోయిన ఆమె భర్తను అనసూయ తిరిగి బ్రతికించింది.

దేవీమూర్తులు ముగ్గురికీ అనసూయపై పట్టరాని ఈర్ష్యపుట్టింది. భర్తలు రాగానే

ఆనందం కలిగించింది. అతడు ఉత్సాహంగా కొలనులోకి దిగబోయాడు. అంతలో, ఆ ప్రదేశమంతా దద్దరిల్లేలా, ఒక భీకరస్వరం వినబడింది. "నన్ను విడిపించండి! మీకు సహాయం చేస్తాను! నన్ను..."



పింగళుడు ఆ స్వరం వింటూనే అదిరిపడ్డాడు. అతడి దృష్టి ఆ ధ్వని వస్తున్న వైపుకు వెళ్ళింది. కొలను గట్టునే, ఒక చోట, రెండు పెద్ద కొండరాళ్ళకు గొలుసులతో బంధింపబడిన నల్లని వికృతాకారం అతడికి దృష్టి గోచరమయింది. పింగళుడు బెంబేలుపడి ఒక త్రుటి కాలంలో వెనుదిరిగి పారిపోదామనుకుని, అంతలోనే ఆ వికృతాకారుడు బలమైన గొలుసులతో రాళ్ళకు బంధించబడి వున్న సంగతి గుర్తుకు తెచ్చుకుని, ఉన్న చోటునే వుండిపోయాడు.

"ప్రభూ, స్వామీ! నా చేతులకున్న యీ గొలుసులు బద్దలు కొట్టి, నన్ను కాపాడండి. నేను మీకు ఏ సహాయం కావాలన్నా చేస్తాను," అంటూ ఆ వికృతాకారుడు, పింగళుడి కేసి తల తిప్పి అరవసాగాడు.

పింగళుడికి ఆసరికి బాగా ధైర్యం కలిగింది. అతడు అడుగులో అడుగు వేసుకుంటూ, ఆ వికృతాకారుడి దగ్గిరకు వెళ్లాడు. దగ్గిరలో వుండి చూసినప్పుడు, ఆ వికృతాకారుడు మరీ భయంకరంగా కనిపించాడు. తాటి మొదళ్ళలా వున్న కాళ్ళూ, జడల బర్రెలా వంటి నిండా నిక్కబొడిచిన రోమాలూ, ఏనుగు చెవుల లాంటి పెద్ద చెవులూ, నిప్పులు చెరిగే కళ్ళూ—పింగళుడు భయంతో కంపించి పోయాడు.

"స్వామీ, నన్ను కాపాడండి! మీకు ఎలాంటి సాయమైనా చేయగలను. ఈ మూడు లోకాల్లో ఎక్కడికైనా, మిమ్మల్ని నా భుజస్కంధాల మీద మోసుకు పోగలను," అన్నాడు వికృతాకారుడు.

పింగళుడు, ఆ మాటలకు నవ్వి, "మూడు లోకాలకే కాదు, పధ్నాలుగు

లోకాలకూ నన్ను కావాలంటే మోసుకు పోగల గాడిద నా కొకటి వుంది. నిన్ను చూస్తే, గాడిద కంటె బలమైనవాడివీ, తెలివి గలవాడివీగా కూడా కనబడు తున్నావు. నీ పేరేమిటి ?'' అన్నాడు.

''నా పేరు భల్లూకకేతుడు!'' అన్నాడు వికృతాకారుడు వినయంగా.

''ఇక్కడకు దాపులనే వున్న భల్లూక పర్వతాల సంగతి నీకు తెలుసా ?'' అని అడిగాడు పింగళుడు.

''భల్లూక పర్వతాల సంగతా ?'' అంటూ భల్లూకకేతుడు వికృతంగా నవ్వి, ''నేను ఒకప్పుడు ఆ భల్లూకపర్వతాలకు అధిపతిని. ఒక మాంత్రికుడి మూలంగా, నాకీ దురవస్థ పట్టింది. మీరు నన్ను బంధవిముక్తుణ్ణి చేస్తే, ఆ పర్వతాల్లో వున్న సర్వసంపదలూ మీవిగా చేస్తాను,'' అన్నాడు భల్లూకకేతుడు.

భల్లూకకేతుడు అలా అనేసరికి, పింగళుడికి ఎక్కడలేని ఆశా కలిగింది. భల్లూకకేతుడి సాయంతో, తను భల్లూకపర్వతాల్లో వున్న నిధినిక్షేపాలన్నీ వశపరచుకో వచ్చుననుకున్నాడు. కావాలంటే, అందులో పద్మపాదుడికి కూడా పాలు పంచవచ్చు.

''అయితే, నిన్ను యీ గొలుసులనుంచి విముక్తుణ్ణి చేస్తాను. కాని, ఆ తరవాత నాకు హాని చేయవని నమ్మకమేమిటి ?'' అని ప్రశ్నించాడు పింగళుడు.

భల్లూకకేతుడు ఆశగా పింగళుడి కేసి చూస్తూ, ''స్వామీ, అడిన మాట తప్పితే, తల పగిలిపోతుందని, నాకు శాపం వుంది. మీకు హాని చేయనని మాట యిచ్చిం తరవాత, చావదలిస్తే తప్ప, అందుకు భిన్నంగా ప్రవర్తించలేను,'' అన్నాడు.

పింగళుడికి, భల్లూకకేతుడి మాటల్లో నమ్మకం కలిగింది. అతడు కొలను ఒడ్డునే వున్న ఒక రాయి తీసుకుని, ముందుకు వెళ్ళబోయాడు. ఇంతలో వెనక నుంచి పద్మపాదుడు, ''పింగళా! ఆగు !'' అంటూ బిగ్గరగా కేకవేశాడు.

(ఇంకా వుంది)





# ఏడ్పూ-నవ్వూ

పట్టుదలతో విక్రమార్కుడు ఇరుగుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, శవాన్ని చెట్టుమీది నుంచి భుజాన వేసుకుని వస్తూండగా, శవంలో ఉన్న బేతాళుడు, ''రాజా, ఇంకొకరి చేత పనులు చేయించుకోవలసిన నువే ఈ అర్ధరాత్రి వేళ ఇంత శ్రమ పడటం నా కెంతో విచారంగా వున్నది. నీకు మార్గాయాసం కలగకుండా ఒక చిత్రమైన కథ చెబుతాను విను,'' అంటూ ఈ కింది కథ ఆరంభించాడు:

భగవంతుడు శ్రీరామచంద్రుడుగా అవతారమెత్తి పరిపాలించిన అయోధ్యా నగరాన్ని ఒకప్పుడు వీరకేతు మహారాజు పాలించాడు. ఆ సమయంలో అయోధ్యలో ప్రతి నిత్యమూ అతి విచిత్రమైన దొంగ తనాలు జరగసాగాయి. ఈ దొంగతనాలకు తట్టుకోలేక ప్రజలు రాజుగారి దగ్గిరికి వెళ్ళి, ''మహాప్రభూ, మమ్మల్ని దొంగల

బేతాళ కథలు




బారి నుండి ఎట్లాగైనా కాపాడండి. మేము ఎన్ని ప్రయత్నాలు చేసినా దొంగల ఆచూకీ తెలియటం లేదు. ఈ దొంగలు చిక్కక పోవటం అటుంచి, కనీసం కంటికైనా కనపడకుండా అతి సాహసమైన దొంగతనాలు చేస్తున్నారు!'' అని మొరపెట్టుకున్నారు.

వీరకేతు మహారాజు ప్రజలను ఓదార్చి పంపేసి, తన రక్షకభటులలో అత్యంత సమర్థులైన వారికి మారు వేషాలు వేయించి, రాత్రిపూట రహస్యగస్తీ తిరగమని పంపాడు. వారంతా వెయ్యికళ్ళతో కనిపెట్టివున్నా కూడా దొంగతనాలు యథాప్రకారం జరుగుతూనే వున్నాయి. ఒక్క దొంగ అయినా గస్తీ తిరిగే భటుల కళ్ళ పడలేదు.

దొంగతనాలు సాగిస్తున్న వారెవరో చాలా యుక్తిపరులని నిర్ధారణ చేసుకున్న వాడై, వీరకేతు స్వయంగా దొంగలను పట్టటానికి బయలుదేరాడు. రాత్రి చీకటిలో రాజు మారువేషం వేసుకుని పోతూండగా ఆయనకు ఒకచోట విచిత్రంగా ప్రవర్తించే ఒక వ్యక్తి కనిపించాడు.

రాజు అతడి కేసి బయలుదేరాడు. దగ్గరకు వస్తున్న రాజును చూసి సందేహించి ఆ వ్యక్తి, ''ఎవరు నువ్వు?'' అని అడిగాడు కోపంగా.

''దొంగను!'' అని జవాబు చెప్పాడు రాజు.

''అయితే నాకు సాటివాడివే! మా ఇంటికి పోదాం రా! నీకు స్నేహమర్యాద చేస్తాను,'' అన్నాడు ఆ వ్యక్తి.

రాజు అతని వెంట వాళ్ళ ఇంటికి వెళ్ళాడు. ఆ ఇల్లు అడవిలో భూగర్భంలో రహస్యంగా నిర్మించి ఉన్నది. దొంగ, రాజును ఒక గదిలోకి తీసుకుపోయి కూచోబెట్టి, వెంటనే వస్తానని చెప్పి, పక్క గదిలోకి వెళ్లాడు.

ఆ సమయంలో దాసీ ఒకతె వచ్చి, రాజుతో, ''నువ్వెవరు, బాబూ! ఈ గజదొంగ రహస్యం తెలిసినాక నీకు ఆయువు

మూడినట్టే! వెంటనే పారిపో!" అని హెచ్చరిక చేసింది.

రాజు వెంటనే అక్కడినుండి బయలుదేరి అతి శీఘ్రంగా తన నగరుకు తిరిగిపోయి సాయుధ భటులతో అదేచోటికి తిరిగి వచ్చాడు. గజదొంగకూ, రాజభటులకూ ఘోరమైన యుద్ధం జరిగింది. ఒంటరిగాడై ఉండి కూడా రాజభటులందరితోనూ ఎంతోసేపు ధైర్యంగా పోరాడి. అనేకమంది రాజభటులను చంపి చిట్ట చివరకు దొంగ రాజు చేతిలో ఓడిపోయాడు.

వీరకేతు మహారాజు దొంగను పెడరెక్కలు విరిచికట్టి నగరానికి పట్టుకుపోయాడు.

అతని విచారణ జరిగింది. చాలా కాలంగా ఎవరికంటా పడకుండా ఆ దొంగే అయోధ్య అంతటా దొంగతనాలు చేసినట్టు రుజువయింది. పోయిన సొత్తంతా అరణ్యంలోని వాడి యింట దొరికింది.

వీరకేతు మహారాజు గజదొంగను కొరత వేయించమని భటులకు ఉత్తరువిచ్చాడు.

దొంగను రాజభటులు కొరత వేయించటానికి ఊరిబయటికి తీసుకుపోతుండగా, అయోధ్యానగరంలోని పెద్ద వైశ్యులలో ఒకడైన రత్నదత్తుడనే వాడి కూతురు రత్నవతి అనే యువతి దొంగను చూసి,



తన తండ్రిని పిలిచి, "నాన్నా, నన్నా దొంగకిచ్చి పెళ్ళి చెయ్యండి!" అని అడిగింది. రత్నదత్తు డీ మాట విని నిర్ఘాంతపోయాడు.

ఎందుకంటే రత్నవతి లేకలేక కలిగిన బిడ్డ. ఆమెను రత్నదత్తుడు ఎంతో గారాబంగా పెంచుతూ వచ్చాడు. రత్నవతి అపురూపమైన అందగత్తెగా ఉండటం చూసి ఎంతోమంది కోటీశ్వరులైన వైశ్య కుమారులూ, రాజకుమారులూ ఆమెను పెళ్ళాడతామని వచ్చారు. రత్నవతి అందరినీ నిరాకరించడమే గాక తనకు పెళ్ళే అవసరం లేదని కూడా తల్లిదండ్రులకు చెప్పింది.

"ఏం తల్లీ? నువు రాజాధిరాజులను కూడా పెళ్ళాడ నిరాకరించింది, నగరాన్ని దోచుకుబతుకుతున్న ఈ దిక్కుమాలిన దొంగ కోసమా? వాణ్ణి కొరత వేయటానికి భటులు తీసుకుపోతున్నారు. అటువంటి వాడినా పెళ్లాడేది?" అని రత్నదత్తుడు కుమార్తె నడిగాడు.

రత్నవతి తండ్రి మాటలు వినిపించుకో లేదు. అనేకమంది రాజకుమారులామెను వరించి వచ్చినప్పుడు తండ్రి ఆమెకు పెళ్ళి చేసుకోమని సలహా ఇచ్చాడు. కాని అప్పుడు కూడా ఆమె తండ్రి మాటను ఏ మాత్రం వినిపించుకుని ఉండలేదు.

"దొంగ అయేది, కొరత పడేది, అతన్నే నా భర్తగా వరించాను. నాకు పెళ్ళి కావాలని వుంటే అతన్ని తెచ్చి నాకు పెళ్ళి చెయ్యండి. మీకది చాతకాని పక్షంలో నేను కూడా అతనితోనే చచ్చి పోతాను. అంతేగాని, ఏ పరిస్థితుల్లోనూ, నా మనసు మాత్రం మార్చుకునేది లేదు," అన్నది రత్నవతి.

ఈ మాటలు విని రత్నదత్తుడు చాలా కంగారు పడ్డాడు. తన కుమార్తె నిశ్చయం మారదని ఆయనకు తెలిసిపోయింది. ఆయన వెంటనే వీరకేతు మహారాజు దగ్గిరికి వెళ్ళి, "మహాప్రభూ, మీ రీనాడు పట్టిన గజదొంగను నాకు ఇచ్చెయ్యండి. నేను తమకు నా దగ్గిర ఉన్న నూరు కోట్ల సువర్ణాలూ ఇచ్చుకొంటాను," అన్నాడు. కాని రాజు ఒప్పుకోలేదు. అయోధ్యానగ



ధాన్ని ఎంతోకాలం ఒంటరిగా పీడించిన గజదొంగను విడిచిపుచ్చటానికి ఆయన మనసు ఎంతమాత్రం ఇష్టపడలేదు. హతాశుడై రత్నదత్తుడు ఇంటికి తిరిగి వచ్చేసరికి, రత్నవతి స్నానంచేసి పెళ్ళి కూతురై సిద్ధంగా వుంది.

''అమ్మా, నా ప్రయత్నం ఫలించ లేదు. దొంగను విడిచిపుచ్చటానికి రాజు ఏమాత్రం ఒప్పుకోలేదు. నా కున్న సంపద నంతా యిస్తానన్నాను. కాని లాభం లేక పోయింది. నువు కోరిన పెళ్ళి అసంభవం!'' అన్నాడు రత్నదత్తుడు విచారంగా కూతురితో.

''పెళ్లి కాకపోతే సహగమనం ఉండనే ఉన్నది,'' అన్నది రత్నవతి.

రత్నవతి పల్లకీ ఎక్కి వధ్యభూమికి బయలుదేరింది. ఆమె వెంట ఏడుస్తూ తల్లిదండ్రులు కూడా బయలుదేరారు. వారు వధ్యభూమికి వెళ్లేసరికి అప్పటికే గజదొంగను తలార్లు కొరత వేశారు. అతను చావుబతుకుల మధ్య ఉన్నాడు.

రత్నదత్తుడు తన కుమార్తెను దొంగ వద్దకు తీసుకుపోయి, ''ఇదిగో, నాయనా, నా కుమార్తె నిన్నే పెళ్ళాడతానని పట్టు బట్టి వచ్చింది!'' అని చెప్పాడు. ఈ మాటవిని దొంగ ఒక్కసారి రత్నవతి కేసి చూసి కన్నీరుకార్చి, వెంటనే చిరునవ్వు నవ్వి, మరుక్షణం ప్రాణంవిడిచాడు.

రత్నవతి తాను నిర్ణయించుకున్న ప్రకారం భర్త కళేబరాన్ని తీసుకుని శ్మశా



నానికి పోయి, అక్కడ చితి పేర్పించి, దానిమీద దొంగశవంతోపాటు తాను కూడా ఎక్కింది.

మనసులో భర్తగా స్వీకరించిన మాత్రాన సహగమనం చెయ్యటానికి సిద్ధపడిన రత్నవతి పతిభక్తికి సంతోషించి కాలభైరవుడు ప్రత్యక్షమై, "అమ్మా, నీ పతిభక్తి అసాధారణంగా ఉన్నది. నీ కే వరం కావాలో కోరుకో, ఇస్తాను," అన్నాడు.

"దేవా, నా తలిదండ్రులకు నే నొక్కతెనే కుమార్తెను. నేను పోతే వాళ్లు కడుపు కోతతో అల్లాడిపోతారు. వారికి పుత్రులు కలిగేట్టు అనుగ్రహించు. వారిని చూసుకుంటూ నన్ను మరిచిపోతారు," అన్నది రత్నవతి వినయంగా.

కాలభైరవుడు నవ్వి, "నీ కోరిక ప్రకారమే చేస్తాను. కాని నువు నీకై ఏమీ కోరవా?" అని అడిగాడు.

"నాకు నా భర్త వెంట వుండటం తప్ప ఇంకే కోరికా లేదు!" అన్నది రత్నవతి.

"అలాగే ఆ కోరిక కూడా తీరుస్తాను!" అంటూ కాలభైరవుడు దొంగను బతికించి అంతర్ధానమైనాడు. రత్నదత్తుడు దొంగను గౌరవ మర్యాదలతో ఇంటికి తీసుకువచ్చి వైభవంగా తన కుమార్తెకు వివాహం చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, కొరత పడి చచ్చిపోతూ, రత్నవతి తనను పెళ్లాడ గోరిందని విని దొంగ ఎందుకు ఏడ్చాడు? తరవాత ఎందుకు నవ్వాడు? తెలిసి సమాధానం చెప్పకపోయావా, తల పగిలిపోతుంది," అన్నాడు.

"ఈ అకారణ బంధువుల రుణం తీర్చుకోకుండానే పోతున్నానే అని దొంగ మొదట దుఃఖించాడు. ఎంతమంది రాజాధిరాజులనో నిరాకరించిన కన్య తనను వరించటం చూసి నవ్వాడు," అని జవాబు చెప్పాడు విక్రమార్కుడు.

రాజుకు మౌనభంగం కాగానే బేతాళుడు శవంతో కూడా మాయమై చెట్టెక్కాడు.






# నమ్మదగిన కల

పూర్వం ఇంద్రప్రస్థనగరంలో ఒక గొప్ప ధనికుడుండేవాడు. కొంతకాలం సుఖాలలో మునిగి తేలినాక ఆయనకు రోజులు కలిసిరాక, వున్న ఆస్తి యావత్తూ పోయింది. ఒకప్పుడు గొప్పగా బతికినవాడు కాస్తా ఇప్పుడు పూర్తిగా బీదవాడైపోయాడు.

ఈ స్థితిలో ఉండగా ఆయనకు ఒక రాత్రి నిద్రలో ఒక కల వచ్చింది. ఆ కలలో ఆయనకు శ్రీమహావిష్ణువు కనిపించి, ''నువు వెంటనే బయలుదేరి పాటలీపుత్ర నగరానికి వెళ్ళు. అక్కడ నీకు డబ్బు దొరుకుతుంది, దానితో నువు తిరిగి ధనికుడవై సుఖపడ గలవు!'' అని చెప్పాడు.

కలలో శ్రీమహావిష్ణువు చెప్పిన మాటలలో గురికుదిరి ఆ నిర్భాగ్యుడు ఒంటరిగా కాలినడకను ప్రయాణంచేసి చాలా రోజులకు పాటలీపుత్ర నగరం చేరుకున్నాడు. అసలే ఆయనకు ఆ నగరం కొత్త. దానికి తోడుగా ఆయన నగరంలోకి ప్రవేశించేసరికి బాగా చీకటి పడింది. అమావాస్య రోజులు కావటంచేత ఆకాశాన చంద్రుడు కూడా లేడు.

అందుచేత ఆయన ఎలాగో ఒక గుడి చేరుకుని ఆ గుడి మంటపంలో పడుకుని కొద్దిసేపట్లో నిద్రపోయాడు. నగరమంతా మాటుమణిగిన కొంతసేపటికి ఆ గుడిని ఆనుకునివున్న ఒక ఇంట దొంగలు ప్రవేశించారు. ఆ ఇంటి యజమాని దొంగల అలికిడి విని నిద్రలేచి, ''దొంగలు! దొంగలు!'' అని గొంతెత్తి అరిచాడు. క్షణంలో చుట్టుపక్కలవారంతా వచ్చారు.

దొంగల ఆట కట్టయింది. వారు గోడ మీదినుంచి గుడి ఆవరణలోకి దూకి మంటపం పక్కగా పరుగుతీసి చీకటిలో అంతర్థానమైనారు. వారిని తరుముకుంటూ

ఎ. సుశీలకుమారి

వచ్చిన జనం గుడి ఆవరణ అంతా వెతికి, చివరకు మంటపంలో నిద్రపోతున్న పరదేశిని పట్టుకుని చేతులుకట్టి, తలారి వద్దకు లాక్కుపోయారు.

దూరప్రయాణం చేసి మట్టి కొట్టుకుని వున్న ఆ పెద్దమనిషి తలారికి దొంగలాగే కనిపించారు. ఆయన ఆ పరదేశిని తన భటులచేత బాగా తన్నించి, "నిజం చెప్పు! ఎవరు నీవు? ఎందుకు దొంగతనానికి వచ్చావు?" అని అడిగాడు.

"అయ్యా, నేను దొంగనుగాను. మాది ఇంద్రప్రస్థం. నేను ఒకప్పుడు బాగా బతికినవాణ్ణి. భగవంతుడు రెండు సార్లు నన్ను మోసగించాడు మొదట నా కున్న ధనమంతా పోగొట్టాడు. అంతటితో తృప్తి తీరక, శ్రీనారాయణమూర్తి రూపంలో కలలో కనిపించి నన్ని పాటలీపుత్రానికి వెళ్ళమనీ, యిక్కడ నాకు ధనం దొరుకుతుందనీ చెప్పాడు. ఆ మాటలు నమ్మి ఎంతో శ్రమపడి ఇంద్రప్రస్థం నుంచి ఇక్కడి దాకా నడిచి వచ్చి ఈ రాత్రే చేరాను. వచ్చి నాలుగు ఘడియలైనా కాకముందే తమచేత తన్నులు తిన్నాను!" అన్నాడు పరదేశి.

ఈ మాటలు విని తలారి నవ్వి, "ఓయి, పిచ్చివాడా! ఎవరైనా కలలను నమ్ముతారా? కొద్దికాలం కిందట నాకు కూడా కలలో శ్రీమన్నారాయణమూర్తే కనిపించి, మీ ఇంద్రప్రస్థంలోనే ఫలాని ఇంటి వెనక ఫలాని చెట్టుకింద తవ్వితే గొప్పనిధి దొరుకుతుందన్నాడు. నేనామాటలు నమ్మి ఇంద్రప్రస్థం వెళ్లలేదే! కనక నువు ఇలాటి పిచ్చినమ్మకాలు మాని హాయిగా ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్ళు!" అని సలహా ఇచ్చాడు.

డబ్బు పోగొట్టుకున్న ధనికుడు వెంటనే బయలుదేరి ఇంద్రప్రస్థానికి వెళ్ళాడు. ఆయన తలారి చెప్పిన గుర్తునుబట్టి ఒక చెట్టుకింద తవ్వి చూడగా నిజంగానే పెద్ద నిధి దొరికింది. దానితో ఆయన తిరిగి ధనవంతుడై సుఖంగా ఉన్నాడు. ఈ విధంగా ఆయనకు వచ్చిన కల నిజమయింది.





# కోడి ఖరీదు

ఒక గ్రామంలో పేరయ్య అనే కమ్మరి ఉండేవాడు. ఒక ఏడు సంక్రాంతివచ్చింది. పేరయ్యను అతని భార్య కోడిని కొనుక్కు రమ్మని అడిగింది. ఆ గ్రామంలోని పెద్ద భూస్వామి అయిన కోటయ్య వద్దకు వెళ్ళి పేరయ్య తనకు ఒక కోడిని అమ్మవలసిందిగా అతణ్ణి అడిగాడు.

కోటయ్య పేరయ్యకు ఒక కోడి పెట్టను ఇచ్చి, "చేతిలో ఇప్పుడు డబ్బు లేకపోతే తరవాతనే ఇయ్యి. లెక్క రాయించి ఉంచుతాను," అన్నాడు. పేరయ్యకు ఈ మాత్రం ఆదరం చూపిన వారెవరూ లేరు. అందుచేత అతను కోటయ్య దయాధర్మాలను చాలా సేపు మెచ్చుకొని ఇంటికి వెళ్లాడు.

ఆ రోజు పేరయ్యా, అతని భార్యా సంతోషంగా కోడిని వండుకు తిన్నారు. కొంతకాలం గడిచాక పేరయ్య భూస్వామికి కోడి బాపతు సొమ్ము ఇవ్వటానికి వచ్చాడు.

"ఇప్పుడు పని మీద ఉన్నాను. ఆ లెక్క చూడాలంటే చాలా సేపు పడుతుంది. తరవాత కనపడు!" అన్నాడు కోటయ్య.

"కోడి ఖరీదు పుచ్చుకోవటానికి లెక్క చూసేదేముందండీ? ఎంత ఇయ్యమంటారో చెప్పండి, ఇచ్చి నా దారిన నేను పోతాను!" అన్నాడు పేరయ్య.

"అబ్బో, దానికి చాలా పెద్ద లెక్క ఉంది," అని కోటయ్య పేరయ్యను పంపేశాడు.

పేరయ్య కోటయ్య చుట్టూ నాలుగైదు సార్లు తిరిగినాక, కోటయ్య కాగితమూ, కలమూ తీసుకుని గంటసేపు ఏవేవో లెక్కలు వేసి చివరకు, "నీ కోడి బాపతు లెక్కంతా కలిసి రెండువందల యాభైరూపాయల చిల్లర అయింది. చిల్లర

వి. రామరాజు

దేమిటిలే, రెండువందల యాభై ఇచ్చెయ్యి. నీ పద్దు కొట్టేస్తాను.'' అన్నాడు.

తాను తిన్న కోడి ఖరీదు రెండువందల యాభై రూపాయలని వినగానే పేరయ్యకు కొంతసేపు నోట మాట కూడా రాలేదు.

''ఒక్క కోడి ఖరీదు రెండువందల యాభై రూపాయలా? ఎక్కడా విననుకూడా లేదే? అదేమన్నా బంగారపు కోడా?'' అని అతను కోటయ్యను అడిగాడు.

''లెక్కలో తభావతు ఏమీ లేదు. కావలిస్తే నీ యిష్టం వచ్చిన వాళ్ళచేత లెక్క వేయించుకో. నువు తీసుకున్న కోడిపెట్ట ఇప్పటికి ఎన్ని గుడ్లు పెట్టేది? అవి పిల్లలై పెరిగి ఎన్ని గుడ్లు పెట్టేవి? వాటన్నిటి ఖరీదూ నువ్విచ్చుకోవలసిందే.'' అన్నాడు కోటయ్య.

ఈ మాటలు వినేసరికి పేరయ్య ఆశ్చర్యం పదింతలయింది.

''ఈ సంగతేమిటో ఏ మునసబుగారినన్నా అడిగి తేల్చుకోకుండా నేనొక్క దమ్మిడీ ఇయ్యను.'' అన్నాడు పేరయ్య.

''మహరాజుగా అడుగు. నే కాదన్నానా?'' అన్నాడు కోటయ్య. మునసబు తనకు అనుకూలంగా తీర్పు చెబుతాడని భూస్వామి కోటయ్యకు తెలుసు.

ఇద్దరూ కలిసి మునసబు దగ్గిరికి వెళ్ళారు. కోటయ్య మునసబుతో, ''మునసబుగారూ, ఈ పేరయ్య మొన్నటి సంక్రాంతికి కాక ఆ కిందటి సంక్రాంతికి



నా దగ్గిర కోడిపెట్ట కొన్నాడు. దాని బాపతు సొమ్ము ఇస్తానంటున్నాడు. ఆ కోడి ఇప్పటికి ఎన్ని గుడ్లు పెట్టేదో, వాటిలో ఎన్ని పిల్లలై, మళ్ళీ అవి గుడ్లు పెట్టి, మళ్ళీ అవి పిల్లలై పెరిగి, గుడ్లు పెట్టేవో, అదంతా లెక్క చూసి రెండు వందలయాభై రూపాయలయిందన్నాను. ఇదుగో లెక్క. మీరు కూడా చూసి ఇందులో తభావతు ఏమైనా ఉందేమో చెప్పండి. అతని సొమ్ము అన్యాయంగా నేనెందుకు తింటాను?'' అన్నాడు.

మునసబు ముక్కు, మూలిగి లెక్కంతా పైనుంచి కిందికి ఒకసారి చూసి, ''ఏం పేరయ్యా, లెక్కలో తప్పేమీ కనిపించడం లేదే?'' అన్నాడు.

''నేనప్పుడే చెప్పాను. పేరయ్యకు నా మాటలు నమ్మకం లేక మీ దాకా తీసుకు వచ్చాడు. చదువు రానివాడు కాదూ, పాపం, లెక్కాడొక్కా తెలీదు,'' అన్నాడు కోటయ్య.

పేరయ్య హతాశుడైపోయాడు. అతను మునసబుగారి దగ్గిర సెలవు తీసుకుని దిగులుగా ఇంటికి పోతూండగా కరణం గారు ఎదురు పడి, ''ఏం పేరయ్యా! చాలా విచారంగా ఉన్నావు; ఏం జరిగిందేం?'' అన్నాడు.

పేరయ్య కరణంతో జరిగిన సంగతంతా చెప్పాడు.

''మునసబు కూడా నిన్ను ముంచాడూ? నే చెప్పినట్టు చేస్తావా? కోటయ్య దగ్గిరికి



వెళ్ళి రేపు రచ్చబండ దగ్గిర ఈ విషయం పరిష్కారం చేసేటందుకు ఒప్పుకోమను. నీ తరఫున నేను సాక్ష్యం చెబుతానని అయనతో చెప్పు," అన్నాడు కరణం.

పేరయ్య కోటయ్య దగ్గిరికి వెళ్ళి ఆ మాటే అన్నాడు.

"మళ్లీ రచ్చబండ తీర్పేమిటి? మునసబుగారు చెప్పారు గా?" అన్నాడు కోటయ్య.

"నాకు మీ లెక్క అర్థం కాలేదు, మునసబుగారి లెక్క అర్థం కాలేదు. రచ్చబండ దగ్గిర నలుగురూ ఏం చెబితే అలా చేస్తాను. కరణంగారు నా వేపు సాక్ష్యం చెబుతామన్నారు. కరణంగారంటే మీకు భయం లేదుగా?" అన్నాడు పేరయ్య.

"నాకేం భయం?" అంటూ కోటయ్య రచ్చబండ తీర్పుకు సమ్మతించాడు.

మర్నాడు సాయంకాలం రచ్చబండ దగ్గిర అందరూ కూడారు. కాని కరణం గారి జాడలేదు. కరణం కూడా తనను మోసం చేశాడని పేరయ్య అనుమానించసాగాడు. అందరూ పేరయ్యను చూసి నవ్వుతూండగా చీకటిపడే వేళకు కరణం గారు వచ్చారు.

"నేను రావటం కాస్త ఆలస్యమైనట్టుంది. మరేం లేదు, కూలివాళ్లు ఇవాళ నారుమడి పోసి తీరాలంటే ఒక పందుం విత్తనాలు మంగలాల్లో అప్పటికప్పుడు వేయించవలిసి వచ్చింది. ఆ పని పూర్తి చేసి వస్తున్నా," అన్నాడు కరణం.

"నారుమడి చల్లే విత్తనాలు వేయించట మేమిటి, కరణంగారూ? వేయించిన విత్తనాలు మొలకెత్తుతాయా?" అన్నాడు మునసబు వెటకారంగా.

"పేరయ్య తిన్న కోడి పిల్లల్ని పెట్టగా లేందీ, వేయించిన విత్తనాలు మొలకెత్తవా అని అనుకున్నాను!" అన్నాడు కరణం.

అందరూ గొల్లున నవ్వారు. మునసబు చీకట్లో జారుకున్నాడు. కోటయ్య పేరయ్యను కోడి ఖరీదు మళ్ళీ అడిగిన పాపాన పోలేదు.






# నరకవాసి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో ఆ నగరంలో ధనికుడైన ఒక గొప్ప వర్తకుడుండేవాడు. ఆయనకు మిత్రవిందకుడని ఒక కొడుకుండేవాడు. ఈ మిత్రవిందకుడు ఎంతో పాపాత్ముడు. వర్తకుడు చనిపోయాక, ఆయన భార్య తన కుమారుడికి, "నాయనా, దానాలు చెయ్యి; నియమాలు పాటించు; ధర్మం అనుసరించు!" అని ఎంతో హితబోధ చేసింది. కాని వాడు తల్లి మాటలు కొంచెమైనా వినిపించుకో లేదు.

ఇంతలో కార్తీక పౌర్ణమి వచ్చింది. మిత్రవిందకుడితో అతని తల్లి "నాయనా, ఇవాళ పుణ్యదినం. తెల్లవార్లూ విహారంలో ధర్మోపదేశం చేస్తారు. నీవు అక్కడ అందరితో పాటు పూజ చేసుకుని, ఉపదేశం వినిరా. తిరిగి వచ్చాక నీకు వెయ్యి రూపాయలిస్తాను," అన్నది.

డబ్బుకోసమని మిత్రవిందకుడు సరే నన్నాడు:

అతను ఉపదేశం వినటానికి వెళ్ళాడు గాని, ఒకమూల పడుకుని నిద్రపోయాడు. తెల్లవారుతూనే లేచి ముఖం కడుక్కుని ఇంటికి తిరిగి వచ్చాడు. తన కొడుకు ధర్మబోధకుణ్ణి వెంటబెట్టుకుని వస్తాడనే ఉద్దేశంతో అతని తల్లి వంటచేసి సిద్ధంగా వుంది. కొడుకు ఒంటరిగా రావటం చూసి, "ధర్మబోధకుణ్ణి తీసుకురాలేదా, నాయనా?" అని అడిగింది.

"ఆయనను ఇక్కడికి తీసుకురావటం దేనికమ్మా? నా కాయనతో పని లేదు!" అన్నాడు మిత్రవిందకుడు.

అతను భోజనం చేసి తల్లి దగ్గిర వెయ్యి రూపాయలూ తీసుకుని తన పని మీద తాను వెళ్ళాడు. ఈ డబ్బుతో అతను బాగా వ్యాపారం చేసి అతి త్వరలోనే



ఇరవై లక్షల రూపాయలు సంపాదించు కున్నాడు.

ఈ డబ్బు పెట్టుబడి చేసి సముద్ర వ్యాపారం సాగిస్తాను; ఇంకా ఎక్కువ డబ్బు సంపాదిస్తాను! అనుకున్నాడు, మిత్రవిందకుడు. అతను ఒక పడవ కొని దానిలో సరుకులు ఎక్కించి, సముద్రాల మీద బయలుదేరుతున్నానని చెప్పిపోవ టానికి, తల్లి వద్దకు వచ్చాడు.

అంతా విని తల్లి కంటతడి పెట్టి. "నాయనా, నాకు నీవొక్కడివే కొడుకువు! నీ దగ్గిర ఇంత డబ్బున్నది గదా, ఇంకా డబ్బు సంపాదించి ఏం చేసుకుంటావు? సముద్ర ప్రయాణం క్షేమం కాదు. నా మాట విని ఈ ప్రయాణం మానుకో, ఇంటి పట్టున వుండు!" అన్నది.

మిత్రవిందకుడు తల్లి మాట వినక, పోయితీరాలని మూర్ఖించాడు. ఆవిడ చెయ్యి పట్టుకుని వెళ్ళవద్దని బతిమా లింది అతడు తల్లిని కొట్టి, తన చేతిని విడిపించుకుని వెళ్ళిపోయాడు.

ఆ రోజే అతని పడవ బయలుదేరింది. అది సముద్రాన్ని చేరుకున్న తరవాత ఏడు రోజులపాటు ప్రయాణం సరిగానే సాగింది. కాని ఎనిమిదవ రోజున నడి సముద్రంలో పడవ ఎటూ కదలక ఆగి పోయింది. ఈ దుర్ఘటనకు కారకులెవరో పడవలోనేవున్నారనే ఉద్దేశంతో నావికులు చీటీవేశారు. చిటీ మిత్రవిందకుడికి వచ్చింది. నావికులు మూడుసార్లు చీటీ వేశారు, మూడు సార్లూ అది మిత్ర విందకుడికే వచ్చింది.

నావికులు మిత్రవిందకుడికి, ఒక తెప్ప ఇచ్చి దాని మీద అతణ్ణి వుంచారు. మరు క్షణం పడవ శరవేగంతో వెళ్ళిపోయింది.

కాలక్రమాన మిత్రవిందకుడు తన తెప్ప మీద ఒక లంకకు చేరుకున్నాడు. ఆ లంకలో అతని కొక స్ఫటికభవనం కనబడింది. అందులో నాలుగు ఆడ పిశాచాలు కాపురం వుంటున్నాయి. ఈ పిశాచాలు వారం రోజులు సరదాగా గడు

పుతాయి; మరి వారం రోజులు అవి పాప ప్రాయశ్చిత్తం కోసం కఠోరమైన నియమాలు అవలంబిస్తాయి. మిత్రవిందకుడు ఆ పిశాచినులతో ఒక వారం పాటు ఇంద్ర వైభోగాలు అనుభవించాడు. పిశాచినులు వ్రతం ఆరంభించేసరికి అతనికి అక్కడ వుండబుద్ధి కాలేదు. అతను తన తెప్ప మీద తిరిగి బయలుదేరాడు.

అతను సముద్రం మీద వెళ్ళగా వెళ్ళగా మరొక లంక తగిలింది. దానిలో ఎనిమిదిమంది పిశాచినులున్నారు. మిత్రవిందకుడు వారితో కూడా వారం రోజులు గడిపి, వారు కఠోర వ్రతాలు ఆరంభించగానే మళ్ళీ తెప్పమీద బయలుదేరాడు.

ఈ విధంగా అతను మరొక దీవిలో పదహారు మంది పిశాచినులతోనూ, ఇంకొక దీవిలో ముప్పైరెండు పిశాచినులతోనూ ఒక్కొక్క వారం గడిపి, ఆఖరుకు తన తెప్పపైన వేరొక లంకను చేరుకున్నాడు.

ఈ లంకలో ఒక పెద్ద నగరం వున్నది. దాని చుట్టూ గోడా; ఆ గోడలో నాలుగు ద్వారాలూ వున్నాయి. అది ఉస్సదనరకం, అయితే మిత్రవిందకుడికి అది నరకం లాగా కనిపించలేదు, అందమైన నగరం లాగా కనబడింది. ''నేనీ నగరంలో ప్రవేశించి దీనికి రాజునవుతాను!'' అనుకున్నాడతను.



నగరంలో ఒక చోట మిత్రవిందకుడికి ఒక మనిషి కనిపించాడు, ఆ మనిషి తన నెత్తిన అసిధారాచక్రం మోస్తున్నాడు. దాని అంచు పదునుగా వుండటం వల్లనూ, అది చాలా బరువైనది గనకనూ, ఆ చక్రం అతని తలలోకి దిగబడిపోయింది. తల నుంచి రక్తం ధారలుగా కారుతున్నది. ఆ మనిషి శరీరం అయిదు పేటల గొలుసుతో బంధించబడి వున్నది. అతను బాధతో మూలుగుతున్నాడు.

ఇదంతా కళ్ళారా చూస్తూ కూడా మిత్రవిందకుడు ఆ మనిషి ఆ నగరానికి రాజని భ్రమపడ్డాడు. అసిధారా చక్రం మిత్రవిందకుడి కళ్ళకు పద్మంలాగా కన

బడింది; అతని వంటి మీది గొలుసు అలంకార భూషలలాగా తోచింది; అతని మూలుగు గంధర్వ గానంలాగా వినిపించింది.

మిత్రవిందకుడు ఆ నరకవాసిని సమీపించి, "అయ్యా, తమరు చాలాకాలంగా ఆ పద్మాన్ని శిరస్సున ధరించారు. నన్ను కూడా ధరించనివ్వండి!" అని అడిగాడు.

"బాబూ, ఇది పద్మం కాదు, అసిధారా చక్రం!" అన్నాడు నరకవాసి.

"చూశావా? నాకివ్వటం ఇష్టంలేక ఆ మాట అంటున్నావు!" అన్నాడు మిత్రవిందకుడు.

"నేటితో నా పాపానికి పరిహారం అయిపోయినట్టుంది. వీడు కూడా నాలాగే తల్లిని కొట్టినవాడై ఉంటాడు. పాపఫలం అనుభవించటానికే వీడిక్కడికి చేరి వుంటాడు!" అని అనుకుని నరకవాసి తన నెత్తి మీద వున్న అసిధారా చక్రాన్ని, మిత్రవిందకుడి నెత్తిన పెట్టి, సంతోషంగా తన దారిన తాను వెళ్ళిపోయాడు.

అప్పుడు స్వర్గంలో ఇంద్రుడుగా వుంటున్న బోధిసత్త్వుడు దేవగణాలను వెంటబెట్టుకుని నరకాలన్నిటినీ తణిఖీ చేస్తూ కొంతకాలానికి మిత్రవిందకుడుండే చోటికి వచ్చాడు.

ఆయనను చూడగానే మిత్రవిందకుడు ఏడుస్తూ, "స్వామీ, కరుణించండి! ఈ చక్రం నన్నెప్పుడు వదులుతుందో చెప్పండి!" అని వేడుకున్నాడు.

అప్పుడు ఇంద్రుడు, మిత్రవిందకుడికి ఈ విధంగా జవాబు చెప్పాడు:

"నీకు ఎంత డబ్బున్నా ఇంకా కావాలని కోరావు. పిశాచినులతో కాలక్షేపం చేశావు. మానవుడు నడవదగిన ఉన్నత మార్గాలు నీకు ఏమాత్రమూ నచ్చలేదు. ఇతరులు నీ మేలుకోరి చెప్పిన సలహా కూడా నచ్చక ఈ చక్రాన్ని కోరి నెత్తికి తెచ్చుకున్నావు! నీవు బతికి వున్నంతకాలమూ ఆ అసిధారా చక్రం నిన్ను వదలదు."

మిత్రవిందకుడు తనకు పట్టిన దుర్దశ తెలుసుకుని, విచారంతో కుంగిపోయాడు.





# రాణా ప్రతాప్

అక్బర్ తన స్నేహపూర్వకమైన విధానాల ద్వారా ఒక్క మేవార్ యువరాజైన రాణాప్రతాపుని తప్ప తక్కిన రాజపుత్ర రాజులందరినీ వశపరచుకున్నాడు. స్వతంత్ర భావాలు గల సాహస వీరుడైన రాణా ప్రతాప్ అక్బర్‌కు తలవంచలేదు. ఏ విధంగానైనా మేవార్‌ను వశపరుచుకోవాలని అక్బర్ పథకాలు వేయసాగాడు.

మేవార్ రాజధానియైన చిత్తోడ్ మీదికి అంతకు పూర్వమే దాడి జరిపాడు. రాణాప్రతాపుని తండ్రి రాణా ఉదయ్ సింగ్ అరణ్యాలకు పారిపోయాడు. కాని ధైర్యవంతులైన జయమల్లు, పున్ను అనే ఇద్దరు రాజపుత్ర సేనానాయకులు కోటకు రక్షణగా నిలబడి పోరాడడం వల్ల అక్బర్, కోటను పట్టుకోలేకపోయాడు.





ఒకనాడు రాత్రి అక్బర్ తన సైనిక శిబిరాన్ని చుట్టి వస్తూన్నప్పుడు, కొండ మీది కోట గోడను కొందరు రాజపుత్ర వీరులు కాగడాలతో పరిశీలించడం గమనించాడు. వెంటనే అక్బర్ పక్కన వున్న సైనికుని నుంచి తుపాకి లాక్కుని, ఆ రాజపుత్ర వీరులలో ఒకణ్ణి కాల్చి చంపాడు. ఆ విధంగా అక్బర్ తుపాకీ గుండుకు జయమల్లు బలి అయ్యాడు.



పున్ను కూడా అంతకుముందే మరణించడంతో చిత్తోడ్ అక్బర్ వశమయింది. మరునాడు ఉదయం రెండు వేల మంది రాజపుత్ర సైనికులు కోట నుంచి అపూర్వమైన రీతిలో తప్పించుకున్నారు. వాళ్ళు స్త్రీల, పిల్లల చేతులు బంధించి వాళ్ళను అక్బర్ సైనిక శిబిరాల గుండానే నడిపించి తీసుకుపోయారు. తమ సైనికులే ఖైదీలను తీసుకుపోతున్నారని అక్బర్ సైనికులు మోసపోయారు.

రాజపుత్ర వీరుల ధైర్యసాహసాలకు ముగ్ధుడైన అక్బర్ ఢిల్లీకి తిరిగి వచ్చిన తర్వాత, ఆ వీరుల స్మృతిచిహ్నంగా తన కోట ఎదుట — జయమల్లా, పున్నా గుర్రాల మీద స్వారీ చేస్తున్నట్టు రెండు విగ్రహాలు ప్రతిష్ఠించాడు.





చిత్తోడ్‌ను పోగొట్టుకున్నప్పటికీ, రాణా ప్రతాప్ మొగలులను ఎదిరించడం మాత్రం వదలలేదు. ఆఖరికి అతడి సోదరుడు శక్తిసింహ్ కూడా అక్బర్ పక్షం చేరాడు. ఒకనాడు పర్వత శ్రేణుల దాపున తన గుర్రమైన చేతక్ మీద పోతూన్న రాణా ప్రతాప్‌ను అసఫ్‌ఖాన్ నాయకత్వంలో మొగల్ సేనలు వెంబడించాయి.



రాణాప్రతాపుని గుర్రం చేతక్ గాయపడి, అలిసిపోయినా వాయువేగంతో పరుగులు తీస్తోంది. ఎవరో పిలుస్తూన్నట్టనిపించి వెనక్కు తిరిగాడు రాణా ప్రతాప్. "నీ గుర్రం మరణిస్తోంది. నా గుర్రం తీసుకో!" అన్నాడు వెంబడిస్తున్న శక్తిసింహ్. చేతక్ ప్రాణాలు వదలడంతో, తన సోదరుడి గుర్రం ఎక్కి అక్కడినుంచి తప్పించుకున్నాడు రాణా ప్రతాప్.

రాణా ప్రతాప్ తన రాణితోనూ, పిల్లలతోనూ, అడవులలో అష్టకష్టాలు అనుభవించాడు. ఒకసారి శత్రువులు రాణా కుటుంబాన్ని సర్వనాశనం చేయడానికి ప్రయత్నించినప్పుడు, అడవిలోని భిల్లులు కొందరు రాణా పిల్లలను తమ బుట్టలలోదాచి అపాయాన్ని తప్పించారు.





రాణా ప్రతాపుని పిల్లలు కాయకసువులు తింటూ చెట్లతీగలతో కట్టిన ఉయ్యాలలలో నిద్రపోతూ కాలం గడపవలసిన దుర్భరమైన పరిస్థితి ఏర్పడింది. అప్పటికి కూడా శత్రువులకు లొంగిపోవడానికి రాణాప్రతాప్ అంగీకరించలేదు.

ఒకనాడు రాణాప్రతాప్ కూతురు తింటున్న దుంపను, అడవిపిల్లి లాగేసుకుని పారిపోయింది. ఆకలికి తన కూతురు ఏడ్వడం చూసిన రాణాప్రతాప్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఈ సంఘటన తర్వాత రాణాకు మొగలులను ఎదుర్కోవాలన్న పట్టుదల మరింత పెరిగిందే తప్ప ఆయన లొంగిపోవాలనుకోలేదు.





అసమానమైన ధైర్యసాహసాలతో రాణాప్రతాప్ పోరాడాడు. నెమ్మదిగా మేవార్ పరగణాలోని కొన్ని ప్రాంతాలను మొగలుల నుంచి తన వశం చేసుకున్నాడు. అక్బర్ అధికారానికి తలఒగ్గని ఏకైక రాజపుత్ర రాజుగా నిలబడ్డాడు.

రాజపుత్రుల వీర సాహసాలకు ప్రతీకగా జీవితం సాగించిన రాణాప్రతాప్ భారతదేశ చారిత్రక మహాపురుషులలో ఒకడయ్యాడు. బలవంతులైన శత్రువులను ఎదురొడ్డి స్వతంత్ర జీవనం సాగించిన రాణా ప్రతాప్ 1597 వ సంవత్సరంలో అమరుడయ్యాడు.



# న్యాయ కత్తెర

CHITRA

చాలా పూర్వకాలమందు కళింగదేశానికి 'న్యాయమిచ్చే దేశం' అని ఖ్యాతి వుండేది. దీనికి ముఖ్య కారణం—అక్కడ న్యాయ విచారణకూ, న్యాయనిర్ణయానికీ ఒక వింత సాధనంగా వుండే న్యాయకత్తెర.

తర తరాలుగా, దీనిని ఆ రాజవంశంలో ఒక అమూల్యమైన వస్తువుగా భావిస్తూ వచ్చారు. ఆ కత్తెర చాలా చిత్రమైన పద్ధతిలో, ఏమీ పొరపాటు లేకుండా న్యాయనిర్ణయం చేసేది.

ఆ న్యాయకత్తెరను రాజభవనం ముందు వేలాడతీసి వుంచారు. వాది, ప్రతివాదులు ఏ న్యాయాధిపతి దగ్గరకూ తీర్పు కోసం వెళ్ళనక్కర లేకుండా న్యాయవిచారణా, న్యాయనిర్ణయం అంతా ఆ కత్తెరవల్లనే జరుగుతూండేది.

వాది, ప్రతివాదులు ఆ న్యాయకత్తెర దగ్గరకు వచ్చేవాళ్ళు. వాళ్ళకు ఇష్టులైన మధ్యవర్తులూ, ఎవరి పక్షాన న్యాయం వున్నదో తెలుసుకోవాలని కుతూహలంతో వచ్చిన ప్రజలూ, చుట్టూ గుమిగూడేవారు. ఫిర్యాది తనకు జరిగిన అన్యాయమంతా ఏకరుపెట్టి తన రెండుచేతుల్నీ ఆ కత్తెర మధ్య పెట్టేవాడు. అలాగే ముద్దాయి తను నిర్దోషినని సమర్థించుకొని, ఆ కత్తెర మధ్య తన రెండు చేతుల్నీ పెట్టేవాడు. ఆ ఇద్దరిలో ఎవడు అబద్ధం చెబుతున్నాడో వాడి చేతుల్ని ఆ కత్తెర ఖండించి వేసేది.

ఒకమారు పాపం, ఆ రాజులకు వరప్రసాదంగా లభించిన న్యాయకత్తెర కూడా, న్యాయనిర్ణయం చేయ సాధ్యం కాని గడ్డు సమస్య ఒకటి ఎదురైంది. ఇలాంటి కఠినమైన సమస్య వస్తుందని ఆ దేశంలో ఎవరూ ఎన్నడూ కలలోనైనా వూహించి ఉండరు.

సి. పద్మరాజు



ఇరుగు పొరుగు వర్తకులు ఇద్దరి మధ్య ఒక పేచీ వచ్చింది. మొదటి వర్తకుడు, "నేను దూరదేశం వెళ్తూ ఇతడి దగ్గిర నూరు నవర్సుల బంగారం దాయమని ఇచ్చాను. తిరిగి వచ్చి నా బంగారం అడిగితే లేదంటున్నాడు. ఏం న్యాయం?" అని అడిగాడు.

అందుకు రెండో వర్తకుడు సమాధానంగా, "ఇతగాడు దూరదేశం వెళ్లాడో లేడో నాకు తెలీదు. నూరు నవర్సుల బంగారం వున్నదో లేదో కూడా నాకు తెలీదు. కాని, ఒకటి మాత్రం ప్రమాణం చేసి మరీ చెపుతున్నాను. ఇతడు నాకు ధాయమని నూరు నవర్సుల బంగారం యివ్వలేదు సరిగదా, ఒక్క మాటూ చూపనైనా చూపలేదు;" అంటూ సంజాయిషీ చెప్పాడు.

సరే, ఈ ఇద్దరిలో ఎవరు నిజం చెపుతున్నారో, ఎవరు అబద్ధం చెపుతున్నారో ఎలా నిర్ణయించడం? ఇద్దరూ కూడా పోటీపడి దేవుళ్ళ మీదా, దేవతల మీదా ఒట్లు వేసుకుని ప్రమాణాలు చేస్తూనే వున్నారు.

పదిమంది పెద్దలూ సమావేశమయ్యారు. నాలుగు రోజుల గడువు పెట్టి, యీ లోపల గనక రాజీపడకపోతే 'న్యాయకత్తెర' నిర్ణయానికి వెళ్ళవలసి వుంటుందన్నారు.

"నా దగ్గిర నూరు నవర్సుల బంగారం దాయలేదని బొంకుతున్నాడు. ఆ వర్తకుడు నిజంగా దోషి. బంగారం దాస్తానని పుచ్చుకున్న మాటా, దాన్ని గుటకాయస్వాహా చేయాలని అతడికి దుర్బుద్ధి పుట్టిన మాటా నిజం," అని మొదటి వర్తకుడు గోల పెట్ట నారంభించాడు.

ఐతే న్యాయకత్తెర నిర్ణయం ఎలా వుంటుందో రెండవ వర్తకునికి తెలియంది కాదు. అబద్ధీకులకూ, అన్యాయ వర్తనులకూ చేతులు ఇట్టే ఖండించుకుని పోవటం అతని కళ్ళతో అతను లోగడ చూసే వున్నాడు. అందుచేత ఆ గండం

గడిచి బయట పడేందుకు, ముందే ఒక చక్కని ఉపాయం ఆలోచించాడు.

ఏమీ ఎరగనట్టు, పెద్ద మనిషిలాగా చేతికర్ర ఊపుకొంటూ అతను వాయిదా రోజున న్యాయకత్తెర వున్న ప్రదేశానికి వచ్చాడు.

మధ్యవర్తులూ, ఏ పక్షాన తీర్పు జరుగుతుందో చూద్దామని వచ్చిన ప్రజలూ రాజ భవనం ముందు చేరారు. న్యాయకత్తెర యథాస్థానంలో వేలాడుతోంది.



నూరు నవర్సుల బంగారం పోగొట్టుకున్న మొదటి వర్తకుడు ఆ కత్తెర మధ్య తన చేతులుంచి ప్రమాణం చేసి తనకు జరిగిన అన్యాయాన్ని, నమ్మకద్రోహాన్ని కళ్ళనీళ్ళతో వివరించాడు. మధ్యవర్తులూ, చుట్టూ చేరిన ప్రజలూ కత్తెర కేసి చూస్తూనే వున్నారు. కాని కత్తెర కదలకుండా అలానే వుండిపోయింది.

ఆ తరవాత, నూరు నవర్సులూ కాజేసినా డనుకొన్న రెండవ వర్తకుని వంతు వచ్చింది. అతను న్యాయకత్తెర దగ్గరకు నిర్భయంగా వచ్చి, తన చేతి కర్రను పక్కనే నిలబడి వున్న మొదటి వర్తకునికే పట్టుకోమని యిచ్చి, చేతుల్ని కత్తెర మధ్య పెట్టి ప్రమాణం చేసి.

"నేను ఎవరి బంగారమూ అపహరించలేదు. నేను అపహరించానని నేరం మోపుతున్న యీ వర్తకుని నూరు నవర్సులూ అతని ధగ్గిరే ఉన్నాయేమో!" అన్నాడు.

మధ్యవర్తులూ, గుమిగూడిన ప్రజలూ కళ్ళార్పకుండా కత్తెర కేసి చూస్తూనే వున్నారు. ఒక్క దెబ్బతో ఆ వర్తకుని చేతులు కత్తిరించుకు పోతవని వాళ్ళ అభిప్రాయం. పైగా, మొదటి వర్తకుని చేతులు ఖండింపబడ లేదు గనుక, ఈ రెండవవాడే నేరస్థుడై వుంటాడని అందరూ భావించారు.

కాని ఆశ్చర్యం! ఆ న్యాయకత్తెర కదలా మెదలక అలా వేలాడుతూనే వుండిపోయింది. ఐతే మరి, ఇద్దరిలోనూ

ఎవరు దోషులైనట్టు? ఎవరు నిర్ణయించేది? ఆ దేశంలో ఇది ఏనాడూ జరిగివుండని వింత సంఘటన. ప్రజలంతా విస్తుపోయి చూస్తున్నారు. మధ్యవర్తులు ఏమీ తోచక తలలు పట్టుకున్నారు. న్యాయనిర్ణయం చేయటంలో ఎన్నడూ ఏ మాత్రమూ తటపటాయించని ఆ కత్తెర నిలకడగా అలా వుండిపోయిందే!

ఉన్నట్టుండి పెద్దమనుషుల్లో ఒకరికి కనువిప్పు కలిగింది. ఇందులోని అసలు కీలకం ఆయన ఇట్టే గ్రహించాడు. దోషి ఐన వర్తకుడు నమ్మకంగా ఎంతో నేర్పుతో వేసిన మడత పేచీని ఛేదించేటందుకు న్యాయకత్తెరకు కూడా సాధ్యం కాలేదని తేలిపోయింది.

ఆ మోసకారి వర్తకుడు వక్రమార్గాన విజయం సాధించాడు. ఈ తెలివికి అతనికి పట్టపగ్గాలు లేకుండా పోయినై. తను ప్రమాణం చేసి న్యాయకత్తెర మధ్యని చేతులు వుంచేటప్పుడు, పట్టుకోమని ఇచ్చిన తన చేతికర్రను మళ్ళీ ఆ వర్తకుని దగ్గరనుంచి తీసుకుని అతడు ఇంటికి పోదామని బయలుదేరాడు.

అతడు నాలుగడుగులు వేశాడో లేదో వెనక నుంచి కేక వినబడింది. వెనక్కు తిరిగి చూసేలోపల ఇందాకటి ఆ పెద్ద మనిషి వర్తకుని చేతికర్రను లాక్కుని, ఫళుక్కున మధ్యకు విరిచాడు.

ఆ చేతికర్ర నుంచి నూరు నవర్సులూ జల జలమని రాలటం లక్షలాది ప్రజల కంట బడింది. ఇది అందరకూ చెప్పలేని ఆశ్చర్యం కలిగించింది.

అప్పుడు పెద్దలు నలుగురూ చేరి నూరు నవర్సులనూ మొదటి వర్తకుడికి ఇప్పించారు. రెండో వర్తకుణ్ణి కఠినంగా శిక్షించారు. ఆ తరవాత, న్యాయ నిర్ణయంలో అపజయం పొంది, పట్టు తప్పిపోయిన ఆ న్యాయకత్తెరను స్థానం తప్పించి, రాజభవనంలోని పాత సామాన్ల కొట్లో పారవేయించారు.

నాటినుంచీ రాజ్యంలోని న్యాయాధిపతులకు చేతినిండా పని కలిగింది.





# ఉత్తుత్త విందు

పూర్వం బాగ్దాదునగరంలో ఒక సంపన్నుడైన వృద్ధుడుండేవాడు. ఆయనకు నగరంలో ఒక రాజభవనం లాటి ఇల్లూ, దాని ముందు రమ్యమైన పూలతోటా, ఇంటి నిండా మఖ్మల్ పరిచిన ఆసనాలూ ఉండేవి. ఆయనకు ఎందరో నౌకర్లూ చాకర్లూ ఉండేవారు. అయినా ఆయన మనస్సు క్రూరమైనది. తిండికీ, గుడ్డకూ లేని పేద సాదలనూ, అనాథలనూ మానసికంగా హింసించటం అంటే ఆయనకు పెద్ద సరదా.

ఒకనాడాయన వరండాలో మెత్తలపై కూచుని ఉండగా తిండికి లేని నిర్భాగ్యుడొకడు వచ్చి ఆయన ముందు వంగి సలాం చేశాడు. ఈ నిర్భాగ్యుడి పేరు షకాక్ షిక్. వాడు తన తండ్రి పోయిన నాటి నుంచీ తిండి కోసం వీధుల వెంట ముష్టిఎత్తుతున్నాడు.

ముసలివాడు వాణ్ణి చూసి ఆప్యాయంగా, "నీకు ఏం సహాయం కావాలి, నాయనా?" అని అడిగాడు.

"బాబూ, ఏదైనా కాస్త ధర్మం చెయ్యండి. రెండు రోజులుగా తిండి లేదు, డొక్క మాడిపోతున్నది," అన్నాడు షకాక్ షిక్.

ముసలివాడు ఉద్రేకంతో, "అరే అల్లా! ఏమన్నావూ? నేను ఈ నగరంలో బతికి ఉండగానే ప్రజలు తిండిలేక అలమటించటమా? అలా జరిగేందుకు వీలు లేదు. నేను సహించను," అన్నాడు.

"పది తరాలపాటు తమరు చల్లగా ఉండాలి, బాబూ. ఈ ఆకలిబాధ ఇంక సహించలేకుండా ఉన్నాను," అన్నాడు షకాక్ షిక్.

"ఇంకేం? నువు ఈ పూట ఇక్కడే ఉండి నాతోపాటు భోంచేద్దువు గాని!"

అంటూ ముసలివాడు ఒక కుర్రవాణ్ణి పిలిచి, చేతులు కడుక్కునేటందుకు నీరు సిద్ధం చెయ్యమన్నాడు. తరవాత ఆయన పక్కకు వెళ్ళి ఉత్తుత్త కూజాలో నుంచి చేతుల మీద నీరు పోసి కడుక్కుంటున్నట్టు నటిస్తూ, "చూస్తావేం, నువు కూడా చేతులు కడుక్కో!" అన్నాడు షక్కాషిక్‌తో.

ఆయన తన చేతులు తడిసినట్టుగానూ, వాటిని బట్టతో తుడుచుకుంటున్నట్టుగానూ నటించాడు.

ఈ నటన ఏమిటో షక్కాషిక్ అర్థం చేసుకోలేకపోయాడు.

ముసలివాడి హాస్యధోరణికి లోలోపల ఆనందిస్తూ వాడు కూడా చేతులు కడుక్కున్నట్టు అభినయించాడు.

"ఒరే, బల్ల మీద గుడ్డ పరిచి వేగిరం భోజనం వడ్డించండి. పాపం, ఈ నిర్భాగ్యుడు చాలా ఆకలి మీద ఉన్నాడు." అని ముసలివాడు తన నౌకర్లను కేక వేశాడు.

వెంటనే అనేకమంది నౌకర్లు అదరా బాదరా వచ్చారు. కొందరు బల్లమీద గుడ్డ పరుస్తున్నట్టు నటించారు. మరికొందరు కంచాలు పెడుతున్నట్టూ, ఆహారపదార్థాలు తెస్తున్నట్టూ నటించారు.

షక్కాషిక్‌కు లోపల ఆకలి దహించుకుపోతున్నా ఈ నాటకమంతా చూస్తూ సహించి ఊరుకున్నాడు. ధనికుల సరదాలను విమర్శించటం దరిద్రుడికి ప్రమాదమని వాడికి తెలుసు.



''కూర్చో, తమ్ముడూ! ఇక భోజనం ప్రారంభించు!'' అంటూ ముసలివాడు తన ముందున్న పదార్థాలను విడివిడిగా రుచి చూసినట్టు అభినయించి దవడలు ఆడించసాగాడు.

''మొహమాట పడకు. నీకు కావలిసినంత హాయిగా తిను. ఇదుగో, ఈ రొట్టె చూశావా? ఎంత తెల్లగా ఉన్నదో!'' అన్నాడు ముసలివాడు.

''ఇంత తెల్లని రొట్టె నేనెన్నడూ తినలేదు. దీని రుచి కూడా అద్భుతం,'' అంటూ షక్కాషిక్ తాను కూడా తినటం అభినయించాడు.

ముసలివాడు ఆ రొట్టెను చేసిన నీగ్రో మనిషి గురించీ, ఆమెకు తానిచ్చే డబ్బు గురించీ చెప్పాడు; తమ ఎదట ఉన్న కూరలనూ, మాంసాలనూ వర్ణించాడు. వాటి రుచినీ, వాసననూ మెచ్చుకున్నాడు. ఆ వర్ణన వింటున్నకొద్దీ షక్కాషిక్‌కు ఆకలి మరింత అవుతున్నది.

మామూలు భోజనం అయిపోయాక ముసలివాడు మిఠాయీలూ, హల్వాలూ తెమ్మని కేకపెట్టాడు. నౌకర్లు వాటిని తెచ్చి పెట్టినట్టు నటించారు.

ముసలివాడు వెనకటిలాగే వాటిని ఎంతో గొప్పగా వర్ణించి, పొగడి, వాటి రుచిని గురించి తన అభాగ్యపు అతిథిని ప్రశ్నించాడు.

ఆ తరవాత ముసలివాడు పళ్ళనూ, పానీయాలనూ తెమ్మన్నాడు.



నౌకర్లు వెంటనే బల్లమీద ఉన్న పళ్ళా లన్నిటినీ తీసుకుపోయినట్టు నటించి, షర్బతులూ, సారాలూ తెచ్చి దాని మీద పెట్టినట్టు అభినయించారు.

"తాగు, నాయనా! ఇలాటి షర్బతు ఎక్కడా లేదు. ఈ సారా చూశావా? చాలా పాతది! తాగు! సుఖంగా తాగు!" అని ముసలివాడు తన అతిథిని ప్రోత్స హిస్తూ, అతని నోటికి గ్లాసులు అందించి నట్టు అభినయించాడు.

ఇంతసేపూ ఈ ముసలివాడి నటనను సహించి ఊరుకున్న షక్కాషిక్ ఇక ఊరుకోలేకపోయాడు. వాడు చివాలున లేచి ముసలివాడి మెడమీద తన చేత్తో దభాల్న ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బకు ఇల్లంతా ఒక్కసారి మారుమోగింది.

ముసలివాడు ఆగ్రహంతో, "ఏం చేస్తున్నావురా, చండాలుడా?" అని అరిచాడు.

"యజమానీ, నేను నీ బానిసను! కాని నువు నా చేత ఆ ఘాటైన సారా తాగించకుండా ఉండవలసింది. అల వాటు లేక నాకు నిషా ఎక్కిపోయింది!" అన్నాడు షక్కాషిక్.

ఈ మాటకు ముసలివాడు విరగబడి నవ్వుతూ, "ఓరి, పిడుగా! నేనిలా ఎందరినో ఏడిపించాను. ఒక్కడు కూడా నువు చూపినంత ఓర్పు చూపలేదు. నీకున్న హాస్యధోరణి కూడా నేనెవరిలోనూ చూడలేదు. నాకు మంచి పాఠమే చెప్పావు. కూచో! అసలు విందు రప్పి స్తాను!" అన్నాడు.

ఈసారి నిజమైన ఆహారపదార్థాలే బల్ల మీదికి వచ్చాయి. అంతకుముందు ముసలి వాడు ఏయే పదార్థాలను వర్ణించాడో అవన్నీ షక్కాషిక్ ఈసారి ప్రత్యక్షంగా తిని ఆనందించాడు.

అది మొదలు షక్కాషిక్ తిండికి మాడలేదు. ఎందుచేతనంటే తాను బతికి ఉన్నన్నాళ్ళూ ముసలివాడు వాణ్ణి రెండు పూటలా తన సరసన కూచోబెట్టుకుని భోజనం చేశాడు.





# భయంకర మానవుడు

ఒక నిర్జనమైన అరణ్యంలో అన్ని రకాల మృగాలూ, పక్షులూ—సింహం పరిపాలనలో సుఖంగా జీవిస్తూండేవి. అందులోకి ఎన్నడూ మనుష్యులు అడుగు పెట్టలేదు. ఆ అరణ్యంలో ఒకనాడు ఒక బాతు నిద్రపోతూండగా ఒక కల వచ్చింది. ఆ కలలో బాతుకు మానవుడు కనిపించి దాన్ని లాలించి దగ్గిరికి పిలిచాడు. బాతు మానవుడి దగ్గిరికి పోబోతూండగా ఎవరో దాని చెవిలో పెద్దగా అరిచినట్టయింది. "ఆ మృగం జోలికి వెళ్ళకు. అన్ని మృగాలకన్నా అది క్రూరమైనది!" అనే మాటలు విని బాతు తుళ్ళిపడి నిద్ర లేచి ఆ కంగారులో దిక్కు తెలియకుండా అరణ్యంలో పడి పరిగెత్తసాగింది.

పోగాపోగా బాతుకు సింహం ఉండే గుహ, దానిముందు నిలబడి వున్న యువరాజూ కనిపించాయి. ఈ యువరాజును తల్లిదండ్రులు గుహ దాటి వెళ్ళనిచ్చేవారు కారు; అందుచేత దానికి ప్రపంచ జ్ఞానం లేదు. అడవిలో ఉండే ఇతర జంతువులే తెలియవు.

ఒక పక్షి కంగారుగా పరిగెత్తుకు వస్తూండటం చూసి యువరాజు, "ఓ పక్షి, నీవు ఎవరు? ఏ జాతిదానివి? ఎందుకలా గాభరాగా పరిగెత్తుతున్నావు?" అని అడిగింది ఆశ్చర్యంగా.

"మహారాజా, నేను బాతును, బాతుల జాతికి చెందినదాన్ని. నేను కలలో మానవుణ్ణి చూసి, అది మహా భయంకరమైన మృగమనే మాటలు విని భయపడి పారిపోతున్నాను," అన్నది బాతు.

"వెర్రిదానా, నేను మృగరాజును ఉండగా నీకే మృగం భయమూ లేదు. ఆ మానవుణ్ణి చీల్చి చెండాడేస్తాను. వెనక నాకు కూడా ఇలాగే కలలో మానవుణ్ణి

వై. సోమసుందరం



గురించి హెచ్చరిక జరిగింది. కాని నాకే ప్రమాదమూ జరగలేదు," అంటూ సింహం యువరాజు, బాతు వచ్చినవేపే వేగంగా నడవసాగింది. బాతు గెంతుకుంటూ సింహాన్ని అనుసరించింది.

వారు కొంతదూరం వెళ్ళేసరికి దూరాన దుమ్ము లేచింది. "అదిగో, మానవుడు వస్తున్నట్టుంది, నువు దాక్కో. నేను వాడి అంతు తేలుస్తాను," అన్నది సింహం.

కాని తీరా దగ్గిరికి వచ్చేసరికి అది ఒక గాడిద. "ఎవరు నీవు? నీది ఏ జాతి? ఎందుకిలా గాభరాపడి పరిగెత్తుతున్నావు?" అని సింహం గాడిదను అడిగింది.

"మహారాజా, నేను గాడిదను. మాది గాడిదల జాతి. మానవుడు నన్ను ఏమి హింస పెట్టాడో మీరు ఊహించలేరు. ఎన్ని బరువులు మోశాను! ఎన్ని దెబ్బలు తిన్నాను! నా శక్తి ఉడిగినకొద్దీ దెబ్బలు హెచ్చాయి, తిండి తగ్గింది. ఇక వాడు నన్ను చంపేస్తాడు!" అన్నది గాడిద.

"మృగరాజును నేనుండగా నిన్ను ఎవరూ చంపలేరు. ఆగి, నేను మానవుణ్ణి ఎలా చంపుతానో చూడు!" అన్నది సింహం.

"క్షమించండి మహారాజా. ఆ మానవుడి కంట పడే ధైర్యం నాకు లేదు," అంటూ గాడిద ముందుకు సాగిపోయింది.

మళ్ళీ దూరాన దుమ్ము లేచింది. కాని ఈసారి ఒక గుర్రం నురుగులు కక్కుతూ, ఎగరొప్పుతూ వచ్చింది. సింహం యువరాజు దాన్ని ఆపి పేరూ, జాతీ, పారిపోతున్న కారణమూ అడిగింది.

"మహారాజా, మానవుడికి వెరిచి పారిపోతున్నాను," అన్నది గుర్రం.

"ఇంత పెద్ద జంతువువు, ఇంత బలం గల దానివి, మానవుడికి భయపడుతున్నావా? నీ కన్న మానవుడికి బలం హెచ్చా?" అని అడిగింది సింహం.

"లేకపోతేనేం, మహారాజా? వాడు క్రూరుడు, ఉపాయశాలి. నాచేత ఇన్నాళ్లూ

వెట్టిచాకిరీ చేయించుకున్నాడు. నా వీపున ఎక్కి కూచుని, నాకు కళ్ళెం తగిలించి, నన్ను కొరడాతో కొట్టి, రికాబు ములుకులతో డొక్కలో పొడిచి వేలాది ఆమడలు సవారీ చేసి, ముసలిదాన్నయానని నన్ను చంపించి, నా చర్మం కాజేయజూస్తున్నాడు!". అన్నది గుర్రం. సింహం ఎంత ధైర్యం చెప్పినా వినక గుర్రం సాగి పోయింది.

తరవాత ఆ దారిగుండా ఒక ఒంటె రొప్పుతూ పరిగెత్తుకుంటూ వచ్చింది. అది కూడా భయంకరుడైన మానవుడికి వెరిచే పారిపోతున్నది.

"మిమ్మల్ని అందర్నీ రక్షించే భారం నాది! అందుచేత పారిపోకు. ఇక్కడే ఉండు. నీ వెనకగా వస్తున్న మానవుణ్ణి ఏం చేస్తానో చూడు!" అన్నది సింహం. కాని ఒంటె క్షమాపణ చెప్పుకుని మానవుడి కంట పడకుండా ముందుకు సాగి పోయింది. మానవుణ్ణి చూసి పరిగెత్తే ఈ జంతువులకు తనలో అపాటి విశ్వాసం లేకపోవటం చూసి సింహం ఆశ్చర్య పడింది.

మరి కాసేపట్లో ఒక ముసలి మనిషి అటుగా వచ్చాడు. వాడి నెత్తిన ఒక తట్టా, తట్టలో వడ్రంగపు పనిముట్లూ, తట్టమీద కొన్ని కొయ్యపలకలూ ఉన్నాయి. వాడు సింహాన్ని చూసి తట్టదించి సాష్టాంగ పడి, "జయం, జయం, మహారాజా! వెయ్యేళ్ళు చల్లగా బతకాలి!" అన్నాడు.



శరీరమంతా ముడతలుపడిన ఆ జంతువును చూసి సింహం విరగబడి నవ్వి, "నీవు ఎవరు? నీది ఏ జాతి? నీవు కూడా మానవుడికి భయపడే వచ్చేస్తున్నావా ?" అని అడిగింది.

బాతు వడ్రంగిని చూస్తూనే మూర్ఛపోవటంవల్ల, వాడే మానవుడని సింహానికి చెప్పలేకపోయింది.

"మహారాజా, నేను వడ్రంగిని, వడ్రంగుల జాతివాణ్ణి! ఏలినవారివద్ద మంత్రిగా ఉండే చిరుతపులి ఇల్లు కట్టిపెట్టమని కబురు పంపితే కట్టటానికి వెళుతున్నాను!" అన్నాడు వడ్రంగి.

"ముందు మాకు కట్టకుండా_ మా మంత్రి చిరుతపులికి ఇల్లు ఎలా కడతావు? మా ఇల్లు కట్టి మరీ కదులు!" అన్నది సింహం కోపంగా.

"ముందు చిరుతపులికి ఇల్లు కట్టనివ్వండి, తరవాత తమకు పెద్ద భవంతి కడతాను!" అన్నాడు వడ్రంగి తట్ట నెత్తిన ఎత్తుకుని పోబోతూ.

"వడ్రంగి జాతి జంతువా? నేనెవరో తెలుసా?" అంటూ సింహం తన ముందు కాలి పంజా ఎత్తి విలాసంగా వడ్రంగి రొమ్ముమీద చిన్న తోపు తోసింది. వడ్రంగి ఆ చిన్న తోపుకే వెల్లకిలా పడ్డాడు. వాడి నెత్తిన ఉన్న తట్ట కిందపడి పనిముట్లు చప్పుడు చేశాయి.

"చిత్తం, మీరు కోరినట్టే చేస్తాను," అంటూ వడ్రంగి ఒక బోను చేసి అందులో సింహం దూరే కంత అమర్చాడు, "లోపలికి వెళ్ళి చూడండి!" అన్నాడు.

సింహం లోపలికి వెళ్ళగానే వడ్రంగి బోను వాకిలి చప్పున మూసేసి, సింహాన్ని తమ నగరానికి పట్టుకుపోయేందుకు బయలుదేరాడు.

"ఏయ్, వడ్రంగీ? ఏమిటీ పని?" అని సింహం లోపలినుంచి భీకరంగా అరిచింది.

"నేనే మానవుణ్ణి! నన్ను చూసి నువు పారిపోవలసింది!" అంటూ వడ్రంగి పొట్టచెక్కలయ్యేలా నవ్వాడు.





# విష్ణు కథ

బలిచక్రవర్తి సుతలలోకానికి చేరుకొని పాతాళసామ్రాట్టుగా ప్రతినిత్యం విష్ణు పాదాలను అర్చిస్తూ ఉన్నాడు. దేవతలకు స్వర్గమూ, దేవేంద్రుడికి స్వర్గాధిపత్యమూ తిరిగిలభించాయి.

బలి వుండే సుతలలోక ద్వారాన్ని వేత్ర దండాన్ని పట్టుకొని వామన రూపుడైన విష్ణువు కాపలా కాస్తుండగా, ఒకప్పుడు రావణుడు సుతలాన్ని జయించాలని వెళ్ళాడు. ఈ పొట్టివాడు నన్నేం చేయ గలడు అని ప్రవేశించబోగా, విష్ణువు మహోన్నత ప్రమాణానికి భయంకర రూపంతో పెరిగి కాలిగోటితో రావణుణ్ణి చిమ్మాడు. ఆ విసురుకు రావణుడు లంకలో సొమ్మసిల్లి పడ్డాడు.

తాను సుభిక్షంగా పాలించిన భూమ్మీద పంటలూ అవీ ఎలా ఉన్నాయో పరివేక్షించ డానికి సంవత్సరానికొకసారి బలిచక్రవర్తి అదృశ్యంగా వస్తాడు. సస్యాలకు పుష్టినీ, జీర్ణకారిత్వాన్నీ, బలాన్నీ కలుగజేస్తాడు, కీటక, క్రిమి బాధలు లేకుండా కాపాడు తాడు. అతని రాకకు స్వాగతంగా దీపావళి పండగ అతి వైభవంగా జరుగుతుంది. మర్నాడు బలి పాడ్యమిగా బలిని పూజి స్తారు. వామనుడి త్రివిక్రమాకాశ విజ యానికి గుర్తుగా ఆనందంతో ఆకాశ దీపాన్ని పెడతారు.

దక్షిణమహాసముద్రంలో బలిచక్రవర్తి భూమ్మీదకు వచ్చే ద్వారంగా ఒక ద్వీపం ఏర్పడింది. అది బలిద్వీపంగా పేరొందింది.



బలిచక్రవర్తి వంశీకులైన పల్లవచక్రవర్తులు అతనిపేరున మహాబలిపురాన్ని శిల్ప సంపదలతో నిర్మించారు. కాంచీపురంలో ఉన్నతమైన త్రివిక్రమవామనావతార శిల్పాన్ని నెలకొల్పారు.

బలిచక్రవర్తి కీర్తి చిరస్థాయిగా నిలిచింది.

బలిచక్రవర్తి పాలనలో అణిగి మణిగి ఉండిన క్షత్రియులు తలెత్తి విజృంభించారు. బలంగల వాడిదే భూమి అయిపోయింది. రాజుల నిరంకుశ పాలనలో జనులు తల్లడిల్లిపోయారు.

అప్పుడు విష్ణువు దశావతారాల్లో ఆరోది అయిన పరశురామావతారం ఎత్తి అడవుల్ని నరికినట్టుగా ఇరవై ఒక్కసార్లు క్షత్రియుల్ని గండ్రగొడ్డలితో నిర్మూలించి, ఎప్పుడు ఏది అవసరమో అది సాధించడానికి అవతరిస్తూంటాడని నిరూపించాడు.

నాటి ధరాతలాన్నేలే రాజులందరిలో మేటి,నాయకుడూ, సామ్రాట్టూ అయిన హైహయచక్రవర్తి కార్తవీర్యార్జునుడు సుదర్శనచక్రం అంశతో పుట్టాడు.

ఒకానొక సమయంలో విష్ణువు యోగనిద్ర తీస్తూండగా శంఖచక్రాలు వాదులాడుకున్నాయి.

"సహస్రకిరణుడైన సూర్యుణ్ణి తరిణ బట్టిన రజంతో విశ్వకర్మ నన్ను రూపొందించాడు. వెయ్యి కోణాలతో గిర్రున తిరుగుతూ అనేకమంది రాక్షసుల్ని నేనే కదా ఖండించింది! నన్ను ధరించి విష్ణువు 'చక్రి' అని ఖ్యాతి పొందాడు! నీకు వట్టి ధ్వని తప్పితే మరేదీ చేత కాదు!" అని చక్రం పలికింది.

పాంచజన్య శంఖం, "ఔరా, చక్రపురుషా! ఎంత పొగరుగా మాట్లాడావు! భూమ్మీద పొగరుబోతైన రాజుగా పుట్టు! విష్ణువు మునికుమారుడై కట్టెలు కొట్టే గొడ్డలి మాత్రంతో, నీ పొగరు అంతమొందిస్తాడు!" అని శాపం పలికింది.

శాపం పొందిన చక్రపురుషుడు కార్తవీర్యార్జునుడై పుట్టి హైహయసామ్రాజ్యాన్ని

నాలుగు చెరగులా విస్తరింపజేశాడు. అతడు భగవంతుని అవతారమైన దత్తాత్రేయుడి భక్తుడు, శిష్యుడు. అతని అనుగ్రహంతో అణిమాది సిద్ధుల్నీ, అనేక శక్తుల్నీ పొందాడు. అవసరమైనప్పుడు అనేక ఆయుధాలతో వెయ్యి చేతులు వస్తూండేవి....అని సూతమహర్షి చెప్పగా, నైమిశారణ్య మునులు, "సూత మునీంద్రా! దత్తాత్రేయుడు విష్ణువు అవతారమేకదా, దత్తాత్రేయ చరిత్ర వినాలని కుతూహలపడుతున్నాము!" అని అన్నారు.

సూతుడు దత్తాత్రేయకథ ప్రారంభించాడు:

అత్రిమహర్షి కుమారుడికోసం విష్ణువును తలంచుతూ గొప్ప తపస్సు చేశాడు.

ఇటు అటు బ్రహ్మ, మహేశ్వరులతో కలిసి విష్ణువు ప్రత్యక్షమై, "అత్రిమహర్షీ! నేను నీకు దత్తుడిని అయ్యాను! మేము ముగ్గురమూ ఒక్కటే కనుక త్రిమూర్తుల అంశలతో నేను నీకు కొడుకునౌతాను! దత్తాత్రేయుడిగా పిలువబడతాను!" అని చెప్పి బ్రహ్మమహేశ్వర సహితంగా అంతర్ధానమయ్యాడు.

ఆదే సమయంలో నారదుడు త్రిమూర్తుల అర్థాంగులమని గర్విస్తూన్న సరస్వతి, లక్ష్మి, పార్వతుల ముందు



అత్రిమహాముని భార్య అనసూయ పాతివ్రత్య మహిమ సాటిలేనిదని సహేతుకంగా నిరూపించాడు. త్రిదేవీమూర్తులకు సాధ్యం కాని పనులు చేసింది ఆమె.

అనసూయ గంగను పీడిస్తున్న పాప పిశాచాలను నిర్మూలించింది.

నారదుడిచ్చిన ఇనుప గుగ్గిళ్ళను కమ్మగా పచనం చేసి యిచ్చింది. సూర్యుణ్ణి ఉదయించకుండా చేసిన సుమతిని ఒప్పించి, సూర్యోదయమైతే చనిపోయిన ఆమె భర్తను అనసూయ తిరిగి బ్రతికించింది.

దేవీమూర్తులు ముగ్గురికీ అనసూయపై పట్టరాని ఈర్ష్యపుట్టింది. భర్తలు రాగానే



అనసూయను భంగపుచ్చి రమ్మని పంపారు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు యతీశ్వరుల వేషాలతో అత్రి ఆశ్రమానికి అతిథులుగా వెళ్ళి భవతీభిక్షాందేహి అని నిలబడ్డారు.

అప్పటికింకా అత్రిమహాముని తపస్సు ముగించి ఆశ్రమానికి చేరలేదు. అతిథి సత్కార బాధ్యతలన్నీ అనసూయ మీదనే పెట్టి వెళ్ళాడు.

అనసూయాదేవి అతిథులుగా యతి రూపులై వచ్చిన త్రిమూర్తులకు అతిథి మర్యాదలు జరిపి భోజనానికి కూర్చోమన్నది.

అప్పుడు కపటయతులు ముగ్గురూ ఏక కంఠంతో, "ఓ సాధ్వీ! మా కొక విడువరాని నియమమున్నది—అది అది...." అని నసుగుతూ "నీవు నగ్నంగా వడ్డిస్తేనే గాని తినేదిలేదు!" అని అన్నారు.

అనసూయ, "అలాగా! సరే!" అంటూ వారిమీద నీళ్ళు చిలకరించింది. ముగ్గురు అతిథులూ ముద్దులొలికే ముగ్గురు పసి పాపలైపోయారు.

అనసూయకు మాతృత్వం పొంగి వచ్చింది. పసివాళ్ళకు పాలబువ్వ మెత్తగా కలిపి తినిపించింది. ఒడిలో చేర్చుకొని లాలించి పాలిచ్చింది. త్రిమూర్తులు పసిపాపలై అనసూయ ఒడిలో కమ్మగా నిద్రలోకి జారిపోయారు.

అనసూయ ముగ్గుర్నీ ఉయ్యాలతొట్టిలో పరుండబెట్టి. "ముజ్జగాలేలే ముమ్మూర్తులు నా పాపలైనారు. అదృష్టం అంటే నాదే! బ్రహ్మాండమే వీళ్ళకు ఉయ్యాలతొట్టి; నాలుగు వేదాలే గొలుసులు, ఓంకార ప్రణవనాదమే జోలపాట!" అంటూ తియ్యగా జోలపాడింది.

అప్పుడే ఆశ్రమంలోకి ఒక తెల్లని లేగ ఎద్దు ప్రవేశించి ద్వారం ముందు నిలబడి తలాడిస్తూ మువ్వల సవ్వడి చేసింది.

పెద్ద గరుడపక్షి రెక్కలల్లార్చుతూ ఆశ్రమం మీద తిరగసాగింది.



ఒక రాజహంస వికసిత పద్మాన్ని కరుచుకొని ఎగురుతూ వచ్చి గుమ్మం ముందు వాలింది.

ముద్దొచ్చే నాలుగు రంగుల కుక్క పిల్లలు తోకలాడిస్తూ, ఇంట్లోకి చొరబడ్డాయి. వాటికి తోడు ఒక నాగుపడగ విప్పి ఆడుతూ వచ్చింది.

అంతలో మాహతి వీణపై నీలాంబరి రాగాన్ని పలికిస్తూ నారదుడూ, అతని వెనుక లక్ష్మి, సరస్వతి, పార్వతి వచ్చారు.

నారదుడు అనసూయతో, "అమ్మా, ఈ ముగ్గురమ్మల భర్తలకు చెందిన ప్రాణులు గుమ్మంలో కనిపిస్తూంటే, వాళ్ళిక్కడే ఉంటారని ఇలా వచ్చారు. ఇప్పటికే భర్తల ఎడబాటు వల్ల విరహంతో తల్లడిల్లిపోతున్నారు. వారి భర్తల్ని వారికిప్పించు!" అన్నాడు.

అనసూయ ముగ్గురమ్మలకూ నమస్కరించి సవినయంగా, "తల్లులూ! ఆ ఊయలలో పసివారే మీ వారైతే తీసుకెళ్ళండమ్మా!" అన్నది.

దేవీమూర్తులు ముగ్గురూ నివ్వెరబోయి చూశారు. పసివారు ముగ్గురూ ఒక్కలాగే ఉన్నారు. ఒకటిగా నిద్రపోతున్నారు. లక్ష్మి పార్వతి సరస్వతులు తటపటాయిస్తూంటే, నారదుడు, "ఎవరి భర్తని వారు ఎరక్కపోవడమేమిటి? సిగ్గుపడకండమ్మా. త్వరగా తీసుకోండమ్మా!" అంటూ తొందరచేయగా, ఒక్కొక్కరొక పిల్లవాణ్ణి తీసుకున్నారు.

పిల్లవాళ్ళు ముగ్గురూ ఒక్కసారిగా త్రిమూర్తులుగా నిలబడ్డారు. సరస్వతి శివుణ్ణి, లక్ష్మి బ్రహ్మను, పార్వతి విష్ణువును తీసుకున్నట్లు అప్పుడు తెలిసింది. ముగ్గురమ్మలూ సిగ్గుపడుతూ దూరంగా వెళ్ళి నిల్చున్నారు. అప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వరసగా కలిసిపోయేలాగ అంటిపెట్టుకొని నిల్చున్నారు.

అదేసమయానికి అత్రి ఇంటికి చేరుకున్నాడు. తన ఇంట త్రిమూర్తులను చూసి చేతులు జోడిస్తున్నంతలో, బ్రహ్మ

విష్ణు మహేశ్వరులు కలిసిపోయి, ఒకే ఒక మూర్తిగా దత్తాత్రేయుడు రూపొందాడు.

మధ్య విష్ణువు, ఇటు అటు బ్రహ్మ మహేశ్వరుల ముఖాలతో, అరు చేతులతో శంఖ, చక్ర, గదా పద్మాలు, త్రిశూలం కమండలంతో, భుజాన వ్రేలాడే జోలెలో భిక్షాపాత్రతో, త్రిమూర్తుల సమ్మేళన మూర్తిగా విష్ణువు దత్తాత్రేయావతారంతో అత్రి, అనసూయల కుమారుడైనాడు.

నారదుడు నాదనామక్రియా రాగంతో వీణ మ్రోగిస్తూ దత్తాత్రేయుణ్ణి స్తుతించాడు. శివుని వాహనమైన నంది దూడ ఎద్దుగా అతని వెనుక ఉంటుంది. నాలుగు వేదాలు నాలుగు కుక్కల రూపుతో వెంట ఉంటాయి. సర్పము, గ్రద్ద, హంస పరి సరాల్లో అనుసరిస్తూంటాయి. దత్తాత్రేయుడు మహర్షిగా సదా వనాల్లో తిరుగుతూ ఏకాంతంగా ఆత్మానుసంధానంలో ఉంటాడు. అనేక దివ్యశక్తులను, సిద్ధులను ప్రసాదించే దత్తాత్రేయుణ్ణి మునులు, సిద్ధులు, జ్ఞానులు సదా ఆరాధిస్తూంటారు. హైహయ రాజవంశానికి ఆరాధ్యదైవంగా పూజింపబడ్డాడు.

కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయుణ్ణి అర్చించి మహాబలసంపన్నుడై, సైన్యాలతో విజయయాత్ర బయలుదేరాడు.



జమదగ్ని మహర్షి కుమాళ్ళలో రాముడు చివరివాడు. ఎప్పుడూ గొడ్డలి పట్టి తిరుగుతూ ఆశ్రమాలూ, జనపదాలూ నిర్మించడానికీ, భూమిని సాగుచేయడానికీ అనుకూలంగా అరణ్యాలు నరుకుతూండడమే అతని పని. హిమాలయాల్లో తపస్సు చేసి శివుణ్ణి మెప్పించాడు. శివుడు అతనికి గొప్ప ప్రభావంగల పరశువును ప్రసాదించాడు. ఆ గొడ్డలిని ధరించి పరశురాముడు అని పేరుపొందాడు. భృగు సంతతి వాడవడం వల్ల భార్గవరాముడు అని కూడా పిలువబడ్డాడు.

ఒకప్పుడు పరశురాముడి తల్లి రేణుకాదేవి నదికి వెళ్ళి ఎంతసేపటికీ రాలేదు.

జమదగ్ని దివ్యదృష్టితో భార్య ఏం చేస్తూందో చూశాడు. చిత్రరథుడనే గంధర్వుడు అప్సరసలతో జలక్రీడ చేస్తూంటే, రేణుక ఆ విలాసాన్ని మైమరచి చూస్తూ ఉండిపోయింది. జమదగ్నికి కోపం వచ్చింది.

భార్య వచ్చాక కుమాళ్ళను పిలిచి తల్లి తల నరకమన్నాడు. పరశురాముని అన్నలు అంత పని చేయలేక పోయారు. అడవి నుంచి వచ్చిన పరశురాముడితో జమదగ్ని, "నీ అన్నల తలలనూ, మీ అమ్మ తలనూ నరుకు!" అని అన్నాడు.

పరశురాముడు మారాడకుండా తండ్రి అజ్ఞను శిరసావహించి, ఒక వేటున అన్నలనూ, తల్లినీ తెగటార్చాడు.

జమదగ్ని పరశురాముణ్ణి మెచ్చుకొని ఏం కావాలో కోరుకోమన్నాడు.

"అన్నల్నీ, అమ్మనూ బ్రతికించు!" అన్నాడు పరశురాముడు.

జమదగ్ని అలాగే వాళ్ళను బ్రతికించాడు. తన తపోమహిమ పట్ల పరశురాముడుకి గల విశ్వాసానికీ, సూక్ష్మబుద్ధికీ జమదగ్ని సంతసించి, "పరశురామా! నీవు కారణజన్ముడివి. చిరంజీవిగా ఉంటావు!" అని ఆశీర్వదించాడు.

కార్తవీర్యార్జునుడు విజయయాత్ర ముగించి తన రాజధాని మాహిష్మతీ నగరానికి వెళ్తున్న దారిలో, జమదగ్ని ఆశ్రమం తగిలింది. అప్పుడు రాజూ, పరివారమూ, సైన్యాలూ ఆకలితో ఉన్నారు.

జమదగ్ని కామధేనువు అంశగల తన హోమధేనువు మూలంగా వారందరికీ గొప్ప విందుచేశాడు. ఆ ఆవు ఏది కావలిస్తే అది ఎంత మందికైనా యిస్తుంది. కార్తవీర్యుడు అలాంటిది తన దగ్గర ఉంటే, సైన్యాలకు తిండి సమస్య లేకుండా అన్ని విధాలా ఉపకరించుకో వచ్చుననే దురాశతో సైనికులకు ఆవును మాహిష్మతీ నగరానికి తోలుకురమ్మని ఆజ్ఞాపించాడు. అడ్డు వచ్చిన జమదగ్నిని ముష్కరులైన సైనికులు నేలకు త్రోసి ఆవును యీడ్చుకెళ్ళారు.






అనగనగా ఒక వూళ్ళో కాళీకంకాలమ్మ అనే మంత్రకత్తె ఉండేది. ఆ మంత్రకత్తె కుక్కలను మేకపోతులుగానూ, మనుషలను మానులుగానూ మార్చివేస్తుందని అందరూ అనుకునేవారు. అలా తన మంత్రశక్తితో మార్చివేసిన మేకపోతుల్ని, ఆ మానులతో వండి, రోజూ ఆరగిస్తుందని వాడుక.

ఈ సంగతి పాతాళంలో వున్న ఒక రాక్షసుడికి తెలిసింది. "ఇటువంటి విపరీతపు తిండి తిని, హరాయించుకోగల ఈ కంకాలమ్మ రక్తం ఎంత రుచిగా వుంటుందో కదా!" అనుకొన్నాడు. వాడు ఇందుకోసం దానిని తన నివాసమైన పాతాళానికి తీసుకుపోవాలని నిశ్చయించాడు. ఒకనాడు వాడు ఒక అందమైన రాజకుమారుని వేషంతో కాళీ కంకాలమ్మ ఇంటికి వచ్చాడు.

"కంకాలమ్మా! కంకాలమ్మా! నిన్ను గురించి లోకంలో అందరూ ఎంతో అబ్బురంగా చెప్పుకోగా విన్నాను. నీ అందచందాలను చూసి నేను నిన్ను పెళ్ళాడాలనుకుంటున్నాను. మరి, ఏమంటావు?" అని అడిగాడు.

ఆ మాటలు వింటూనే, కంకాలమ్మ తన బోసి నోరు తెరిచి, హి-హి-హ్హీ అంటూ పెద్ద నవ్వు నవ్వింది.

"అయితే, నీ ఉద్దేశం బాగానే వుంది. కాని నన్ను నువ్వు మీ వూరు తీసుకెళ్ళగలవా?" అని అడిగింది కంకాలమ్మ హేళనగా.

"దానికేముంది? నా వీపుమీద ఎక్కు. క్షణంసేపట్లో మా పట్నం చేరుస్తా." అన్నాడు వాడు గంభీరంగా.

"సరే! కానీ...." అంది కంకాలమ్మ, లేచి నిలబడుతూ.

వి. మందేశ్వరరావు




వాడు పోయి పోయి, బ్రహ్మరాక్షసుడితో మొరపెట్టుకున్నాడు. "ప్రభూ! ఈ దిక్కుమాలిన కంకాలిని, ఎంతో కాలంగా మోస్తున్నాను. ఇది, నా వీపుమీది నుంచి దిగిపోయే ఉపాయం చెప్పండి!" అంటూ.

"ఈపాటిదానికే భయపడిపోతున్నావా? అలా భయపడటం మన జాతికే తలవంపు. ఇంతకూ ఇందులో ఏముంది? ఎక్కడి నుంచి తీసుకువచ్చావో, దీన్ని అక్కడే విడిచెయ్యి." అంటూ, బ్రహ్మరాక్షసుడు రహస్యంగా సలహా చెప్పాడు.

కంకాలమ్మ పీడ వదుల్చుకోవటానికి రాక్షసుడు తిరుగు ముఖం పట్టి వెళుతూ వుంటే, దారిలో ఒక గొర్రెలకాపరి కనబడి నవ్వుతూ "బలే! ఈ గాడిద బరువు ఎన్నాళ్ళనించి మోస్తున్నావయ్యా." అన్నాడు వెటకారంగా.

రాక్షసుడు తుళ్ళిపడి, "వీడెవడో దేవాంతకుడులాగా వున్నాడు. నేను ఈ ముసలిదాన్ని ఇన్నాళ్ళనుంచీ మోసుకు తిరుగుతున్నానని వీడికెలా తెలిసిందో!" అని అనుకుని, "బాబ్బాబు! నాకీ కాస్త ఉపకారం చేసిపెడుదూ!" అంటూ, తన బాధ బయటపెట్టాడు.

"దానికేముంది? ఇప్పుడే నా వీపు మీదికి ఎక్కించవయ్యా!" అన్నాడు కాపరి ఉత్సాహంగా.

కంకాలమ్మని రాక్షసుడు వీపుమీదికి ఎక్కించుకున్నాడు. తరవాత ఒక్క మూడడుగులు వేశాడు. భూమిని ఒక్క తన్ను తన్నాడు. భూమి బద్దలై, పాతాళానికి దోవ కనబడింది.

రాక్షసుడు పాతాళానికి దారితీశాడు. ఐతే, ఎంత ప్రయత్నించినా, ఎన్నాళ్ళు నడిచినా, కంకాలమ్మను కింద దింపటానికి గానీ, పడవేయటానికి గానీ, వాడికి శక్యమయింది కాదు.

దాంతో ఆ రాక్షసుడి ఆశలన్నీ తలకిందులైనాయి. మోయలేక ప్రాణం విసుగెత్తుతున్నది. "ఈ పిశాచం వదిలిపోతే చాలురా బాబూ!" అనుకున్నాడు.



"బ్రతుకు జీవుడా!" అనుకుని, ముసలి కంకాలిని వాడి వీపు మీదికి ఎక్కించాడు రాక్షసుడు. వెంటనే గొర్రెలకాపరి దక్షిణ దిక్కుగా పరుగెత్త నారంభించాడు.

"ఆ ముసలిది వదిలేదేమిటి, యింక వాడు తిరిగి వచ్చేదేమిటి!" అనుకుని రాక్షసుడు గొర్రెలమందను మళ్ళించుకు పోబోయాడు.

రెండడుగులు వేశాడో లేదో, గొర్రెల కాపరి ఎదుట సిద్ధమయ్యాడు.

"ఏం మావా? ముసలిదాన్ని నాకు వప్పగించేసి, నా గొర్రెల మందను మళ్ళించుకపోదా మనుకుంటున్నావా?" అన్నాడు మళ్ళీ నవ్వుతూ కాపరి.

ఆ మాట వినిపించుకోనట్టుగా నటిస్తూ, రాక్షసుడు, "ఐతే ఆ పిశాచిని ఎలా వదుల్చుకున్నావురా!" అని అడిగాడు.

"దానికేముంది! ఈ పక్కనే దిక్కుమాలినవాళ్ళు పడిచచ్చే చెరువొకటి ఉంది. దాంట్లో పడవేసి వచ్చా. అది నా గొంగళి పట్టి ఎంతకూ వొదిలిందేకాదు. పోతే పోయిందని, ఆ గొంగళి కూడా చెరువులోనే వదిలేసి వచ్చా!" అన్నాడు గొర్రెలకాపరి.

వాడు చేసిన ఉపకారానికి సంతోషిస్తూ, రాక్షసుడు వానితో, "అబ్బాయీ! నువ్వు ఒక పనిచెయ్యి. నేను ఈ దేశపు రాజుగారి కూతురుని ఆవహిస్తాను. ఆ అమ్మాయికి మాటా మంతీ, చూపూ చేతా లేకుండా చేస్తాను. ఇవాళకు ముప్ఫయ్యొకటో రోజున వచ్చి, నువ్వు రాకుమార్తె చెవిలో, "నేను గొర్రెలకాపరిని, పిల్లా!" అను. నేనామెను వదిలేసిపోతా. ఆమీదమరి, నీకు పట్టబోయే సిరి ఎటువంటిదో నీవే ఆలోచించుకో!" అని చెప్పాడు.

సరేనని వాడు బయల్దేరాడు. పట్నం వెళ్ళేటప్పటికి ఎక్కడ చూసినా ఇదే గొడవ. "రాజకుమారికి మాట పడిపోయి నెల అయింది. బాగు చేసిన వాళ్ళకి అర్ధరాజ్యమూ, పిల్లనూ ఇచ్చి పెళ్ళిచేస్తారట!" అని.



గొర్రెలకాపరి కోటవద్దకు వెళ్లేటప్పటికే అనేకమంది రాజవైద్యులూ, భూతవైద్యులూ, పెదవి విరిచి బయటకు వచ్చేస్తున్నారు. వాడి వేషం చూసి, అందరూ అసహ్యించుకున్నా, వైద్యుని హోదాలో రావటంచేత లోపలికి వెళ్ళనీయక తప్పిందికాదు.

వాడు దర్జాగా, ఠీవిగా, ధైర్యంగా వెళ్ళాడు. మంత్రాలూ, తంత్రాలూ అట్టహాసం చేశాడు. చివరకు రాక్షసుడు చెప్పిన తిరుమంత్రం రాకుమారి చెవిలో చెప్పాడు.

ఆమెను ఆవహించిన రాక్షసుడు రాకుమార్తెను వదిలేస్తూ కాపరిని, ''ఇదిగో, ఇదే ఆఖరుసారి! ఇటువంటి వైద్యం మరెవ్వరికైనా చేశావంటే, నీ పుర్రె పగులుతుంది సుమా, జాగ్రత్త!'' అని హెచ్చరించి మరీ వెళ్ళాడు.

రాజకుమార్తె వెంటనే లేచి కూర్చుని, కిల కిల నవ్వటానికి ప్రారంభించింది. కోటలో మంగళ వాద్యాలు మోగినాయి. గొర్రెలకాపరి ఆ రాజ్యానికి రాజయ్యాడు. ఐతే, కథ మాత్రం అప్పుడే కంచికి పోలేదు.

రాక్షసుడు తన అలవాటు ప్రకారం పోయి ఇంకొక పొరుగు రాజు కూతురును పట్టి ఇలాగే పీడింప సాగాడు. ఆమెకు కూడా మాటా మంతీ, చూపూ చేతా లేకుండా పోయినై.

ఆ మహారాజు ఎన్నో వైద్యాలు చేయించి, మంత్రాలు వేయించాడు. లాభం లేకపోయింది. చివరకు గొర్రెలకాపరిరాజుగారి పూర్వకథ విని, ఆయనను రమ్మని కబురు చేశాడు.

కబురు అందగానే వాడికి కంగారు పుట్టింది. ఆ రాజకుమారిని వదిలిపోతూ, చిట్టచివర రాక్షసుడు చెప్పిన మాటలు జ్ఞాపకానికి వచ్చినై.

వాడు పొరుగు రాజుతో, ''అయ్యా! నేను మాంత్రికుణ్ణి కాదు, తాంత్రికుణ్ణి కాదు. వైద్యుణ్ణి అసలే కాను. ఏదో వర

ప్రసాదం వల్ల ఆ రాజకుమారిని మాత్రం బాగుచేయగలిగాను. ఆ మంత్రపటిమ అంతటితోనే పోయింది. కనక, నా వల్ల ఏమీ కాదు,'' అని వినయంగా సమాధానం చెప్పాడు.

ఈ మాటలు వినిపించుకోకుండానే, ''మా కోరిక నెరవేరిస్తే సరేసరి, లేకుంటే యుద్ధానికి సిద్ధంగా ఉండు,'' అని రాయబారం పంపాడు పొరుగురాజు.

కొత్తరాజు సందిగ్ధంలో పడి, చివరికి, ''సరే, ఏమైతే కానీ, చూదాం,'' అని బయల్దేరాడు.

కోటలోకి వెళ్ళాడు. మునుపటిలాగానే మంత్రాలూ తంత్రాలూ మొదలైన అట్టహాసాలు అన్నీ చేశాడు. రాజకుమారి చెవిలో, గింగురెత్తేలా ఇలా చెప్పాడు:

''ఇదుగో, నే చెప్పే ఈ మాటలు జాగ్రత్తగా విను! ఆ నాడు మనం చెరువులో పడవేసిన కంకాలి చస్తుందనుకున్నాము. కాని అది చావలేదు. బతికి పైకి వచ్చిందిట. నిన్ను వెతుక్కొంటూ బయల్దేరి వస్తున్నదట. ఊరి పొలిమేర వరకూ వచ్చి వుంటుందని చెప్పుకొంటున్నారు. నువు నాకు ఉపకారం చేశావు కదా అని, ఈ మాట ముందుగా నీకు చెప్ప వచ్చాను....''

వాడు చెప్పడం పూర్తి చేయనే లేదు. 'కంకాలమ్మ' అనే మాట చెవిని పడటంతోనే ఆ రాక్షసుడు ''బాబోయ్!'' అని ఒక్క కేక వేసి, పాతాళానికి దౌడు తీశాడు!

రాక్షసుడు ఎప్పుడైతే వదిలిపోయాడో, ఆ క్షణమందే రాకుమార్తె తన చారెడేసి కళ్ళను తెరిచి చూసి, దానిమ్మ గింజల్లాంటి పండ్లవరస కనబడేటట్టు నవ్వింది! కూతురుకు నయమయిందనగానే వాగ్దానం ప్రకారం, మహారాజు ఆమెను వాడి కిచ్చి అతివైభవంగా పెళ్ళి చేశాడు.

ఈ విధంగా, అదృష్టవంతుడైన గొర్రెల కాపరి ఇప్పుడు ఇద్దరు రాణులకు భర్త ఐనాడు!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



A. Syed

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఈ పూట కిక పండగ · రెండవ ఫోటో: నా జప మిక దండగ

పంపినవారు: జి. జి. కె. మూర్తి, చంద్రమౌళి నగర్ గుంటూరు.

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు:

1. గోవాపురి 2. రాజా ఉగ్రసేనుడి వల్ల. అప్పట్లో ఆగ్రా పేరు ఆగ్రావన్. 3. డోర్జెలింగ్—డోర్జే జాతి నివాస స్థానం. 4. సంస్కృతంలో కాష అంటే వెలుగు అని అర్థం. కాశీ అనగా భక్తులకు వెలుగు దారి. వారణాసి అన్న పేరుకు వరుణ-అసి అన్న నదులు కారణం. అవి రెండూ నగరాన్నిచుట్టి ప్రవహిస్తున్నవి. 5. చండీఘడ్ (హర్యానా)లో వున్న జాకీర్‌హుసేన్ గులాబీ తోట. 6. ఘూమ్. డార్జిలింగ్‌కు ఎనిమిది కిలోమీటర్ల దూరంలో. 7. ఆగ్రా కోటలో వున్న మోతీ మసీదు.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications)

# న్యూట్రముల్ శక్తి.

## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రముల్. సమృద్ధి అయిన అమూల్ పాలు. ఎంచిన మాల్ట్. ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు. పుష్టినిచ్చే ప్రోటీన్లు. అత్యవసరమైన ఖనిజాలు. ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మరో విషయం గుర్తుంచుకోండి, కేవలం న్యూట్రముల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.







**మరింత పొడుగ్గా,**
**బలంగా, పుష్టిగా అవడం ఎలా?**
కనీవినీ ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక:

To: Nutramul, P.O. Box 10148, Bombay 400 001. IT

ప్రియమైన న్యూట్రముల్,

దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజి స్టాంపులూ, న్యూట్రముల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమో జతపరుస్తున్నాను. సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు ________________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు ________________



మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001

daCunha/GCM/76/TL/82

ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు.

— చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి. —



ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. సం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి ఉత్తర వ్యవహారాలు జరుపబడవు.

Name:.......................................................Age:.......................

Address:.......................................................................

...................................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 30-7-1983

**CONTEST NO31**

Vision/CPL83107 Tel.

**Results of Chandamama—Camlin Colouring Contest No. 29 (Telugu)**

*1st Prize:* P. Venkata Ramana Prasad, Katiam Nagar. *2nd Prize:* P. Jagadish, Vijayawada-10. L. Gorisankar, Kothapeta. S. K. Jamaloddin, Nalgonda. *3rd Prize:* G. Viswanadha Kumar, Vishakhapatnam. V. Manga Raju, Vijayawada-6. Sonti Prabhakararao, Vijayawada-1. P. Anand, Visakhapatnam-16. G. Anand Kumar, Amalapuram. M. K. Mohiddin, Rajahmundry. N. Ravi Kumar, Tadepalligudem. C. Gopi, Surendranagaram. Girish Vasant Chiddarwal, Yeotmal.

'నేను పెద్దయ్యాక
హాస్యకథలే చదువుతాను
బిస్కట్లే తింటాను..!



పిల్లలు ప్రేమించేది పార్లే గ్లూకో-
మరింత రుచికరమైన,
శక్తినిచ్చే ఆహారం.




పార్లే
గ్లూకో
భారతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్

